△

ప్రదర్శనానుకూలమైన రసవత్తరనాటకము.

ఇందులో
16 రంగాలు
93 పద్యాలు
16 గేయాలు
యింపైన మాటలు
వున్నాయి.

△

రాజేశ్వరి ముద్రానిలయము
సర్వజిత్ : : వైశాఖము

# పాఠకపరిచయం

పాఠకమహాశయులకు నమస్కారములు.

మీరు మైరావణ చరిత్రను అనేకపక్కీలలో చదివేవుంటారు!

కాని యీ 'మైరావణ' కథలో ఒకవింత మీకు కనిపిస్తుంది. దానిరుచి తమరే గ్రహించాలని నా వూహ! నా కోరిక-కూడా!!

కల్పితమైన కథను మరికొన్ని కల్పనలుగూర్చి రసవంతంగా చేయాలని నా సంకల్పం. మీరు నా సాహసాన్ని అపార్థం చేయరని నా నమ్మకం, అదే యీ నాటకరచనకు ప్రాతిపదికఅయింది!

కావ్యనిర్మాణానికి కారకులైన శ్రీ కాళహస్తి సోదరుల - సార స్వతకృషి చిరస్థాయిగా అభ్యుదయపరంపరతో కొనసాగుతూ - తెలుగుసోదరుల ఆదరాభిమానల్ని చూరగొనాలని నా అభిలాష! వారి ఆదరణకు ప్రశంసా - వారి సంస్థకు నా ఆశీస్సూ సమర్పిస్తూ - క్షమ శలవు తీసుకుంటాను.

మీ అభిమాన రచయిత:

—విశ్వేశ్వరరావు

# ఇందు ముఖ్యపాత్రలు.

## పురుషులు

శ్రీరాముడు
లక్ష్మణుడు
ఆంజనేయుడు
సుగ్రీవుడు
విభీషణుడు
నారదుడు
రావణుడు
మైరావణుడు

## స్త్రీలు

సరమ—విభీషణుని భార్య
మతంగి—పాతాళలంకేశుని భార్య
మండోదరి—రావణునిభార్య

రంగానుకూలముగా తదితరపాత్రలు వత్తురు.

# సమూహ సంగీతము

౧

(గేయం)

ఆశ్రితజనవరదా మము
ఆదరింప విది బిరుదా !
కాంచనచేలా ! ఘనమణిమాలా !
పంచచేరితిమి శ్రీకాంతామలా ! ॥ఆశ్రిత॥
దాసుడనని దరిజేరినవారిని
ఆసమీరగా కాపాడితివే
శ్రీసమేత ! మునివందితచరిత !
నీ సమానమిక లేదు ! సురార్చిత !

(గేయం)

౨

మా భరత జనయిత్రి
మహిత పాదంబులకు
మమతలూరగ నేడు
మల్లెపూదండల నైతు
నే భరతపుత్రుండను
యీ దివ్యదేశీయుడన్
మా త్యాగరాయనికి
మంగళంబులపాడి
మా దేశవిభవంబు
ముదమార దెల్పెదను
నే భరత పుత్రుండను
యీ దివ్యదేశీయుడన్

బోసుబాబున కెపుడు
పూజారి నయ్యెదను
ఆంధ్ర కేసరి కెపుడు
అంజలించెదను

నే భరతపుత్రుండను
యీ దివ్య దేశీయుండన్

యుగమహాపురుషుడౌ
యీ గాంధిదేవునకు !
తులలేని జహ్వాయుకు
దోసి లొగ్గెదను !

నే భరత పుత్రుండను
యీ దివ్య దేశీయుడన్

సర్వజాతుల కెపుడు
శాంతిసఖ్యతగూడ
ఆదిశక్తిని సతము
అభినుతించెదను

నే భరతపుత్రుండను
యీ దివ్య దేశీయుడన్

△

# మైరావణ

## 1

లంకానగరము—రావణుని యేకాంతము.

రావణుడు :—(తనలో) ఔరా! సిరి నిజముగా టక్కరిదిగదా! నిత్యయౌవనరూపిణియై సదా వీరుల బాహుబంధమునందు కుల్కుటకు దానికి విసుగనుమాటయే లేదు. లంకానగరమున రావణసామ్రాజ్యహద్దులలో సింగారించుకొని శృంగారక్రీడల మురిసి మురిపించిన టక్కరి సిరి యీ నాడు యెక్కడ మూల్గుచున్నదో తెలియదుగదా! (చికాకు గల్గినట్లు అటు యిటు తిరుగుచు) యీ జన్మకిక మనశ్శాంతి చేకూరదు కాబోలు! అదిగో పుత్రశోకానలతప్తయైన మండోదరికి మనస్థిమితము లేక యిటు వచ్చుచున్నది.

(ప్రవేశము—మండోదరి)

మండోద :—హా జీవితేశా! పాదములపైబడి యేడ్చుచుండును)

రావ :—ప్రేయసీ! మండోదరీ! వృధావిచారముపడిన లాభమేమున్నది? (లేవదీయును.) కొడుకును కష్టపడి నవమాసములుమోసి కన్నావు. వేదనరంగమునకు కానుకగా నిడినావు. పుత్రశోకము మాకు వరాని దేయైనను వీరమాతృత్వసిద్ధి అలభ్యయోగమని యెఱుగవా? జాతస్య మరణం ధృవమ్ అను ఆర్యోక్తి నీకు తెలియనిదా? వీరమరణమునందిన మన శూరసంతాన దివ్యచరిత్రను చరిత్రకారులు సువర్ణాక్షరములతో రచింపకమానరు. దిగులంది వగలపెంచకుము — పోయి మనశ్శాంతిగనుము.

మం :—జీవితేశా ! అనంతసామ్రాజ్యవైభవోపేతులై - నిరుపమానవిభవోపేతులై నిమ్మకు నీరెత్తినట్లు కడుపులోనిచల్ల కదలకుండ సుఖించియుండెడు మీరు కొఱవితో తలగోకికొనినట్లుగా రామపత్నిని హరించి కయ్యము కల్పించుకొన్నారు. రాజ్యసర్వస్వమును, సమస్త సంపదలను - సత్సంతానమును ఆ రణరంగమునకు బలియిచ్చినారు. వ్యర్థవివాదములు మానరా ? మనోహరా ! శేషించిన జాతినైనను జీవదానం బీయరా ? రాక్షసజాతిని నిశ్శేషముజేయ కంకణము గట్టుకొన్నారా ? ఇదియేనా మీ అభికాంక్ష ! ప్రాణేశా ! నా కుడికన్ను అదురుచున్నది. నాకు దుస్స్వప్నములు అంతులేకుండగ గలుగుచున్నవి. యేదో చెప్పరాని భీతి నా గుండెలలోనున్నది - ఆత్మకూడ చెడుగనే చెప్పుచున్నది—ప్రియా ! సీతమ్మను రామునికిచ్చి రణమునకు స్వస్తి జెప్పరాదా ? రాజ్యమే నశించినప్పుడును - సంపదలే దూరమైనప్పుడును - స్వజాతికే ముప్పు తప్పనప్పుడును మన కెందుల కీవృథాప్రయాసలు - నా మనవి వినుము - యీ పోరాటమును మానుడు - రామచంద్రునితో సంధిసంబంధమును పెంపొందింపుడు. యుద్ధవార్తలతో భీతిల్లిన యీ లంకాసామ్రాజ్యమునకు ధైర్యవచనంబులు జెప్పుడు.

రావ :—చాలు. నీ మెట్టవేదాంతము కట్టిపెట్టుము - నీ పాటి తెలివిలేకనే యీ రాజకీయములందు రావణు ప్రవేశించెననుకొనుచున్నావా ? మండోదరీ - స్త్రీలు సుమసంతానముతో విలాసక్రీడలతో సంతసించదగినవారుకాని - లేనిపోని వ్యథలను మనసునకు రానిచ్చువారుకారు - నీ వీ ప్రసంగము కట్టిబెట్టి నీ మందిరమున కేగుము.

(విచారముతో మండోదరీ నిష్క్రమణ)

రావణా ! నీ పరాక్రమ మింతియేనా ?

సీ. దేవేంద్రుననుగూడ తీరనిఓటమి

ముద్దుగాగూర్చిన భుజబలంబు !

మునుల మంత్రధనంబు మూలత్రోయగజేసి
మురుపు జేకూర్చిన భుజబలంబు!
సాటిరాజులనెల్ల సమరాన నోడించి
నిజకీర్తినింపిన భుజబలంబు!
ఆదిశక్తికినైన హాడలన్నరీతిగా
పొగడొందినట్టి దీభుజబలంబు!
గీ. రాజ్యరమ బాహువులచెంత ప్రమదమలర
పొలుపు నిల్పినయట్టి దీభుజబలంబు!
రావణా! యేల వృథయయ్యె రాముదరిని
లెమ్ము — శౌర్యమ్ము చూపుము తెమ్ము జయము!

గీ. ఒక్కమానవమాత్రుని లెక్కయెంత!
ధైర్యమునువీడి మనసును తల్లడించి
యేమిసేయగవచ్చు — మహీతలాన
రావణుని కష్టతీరునా? రక్తమైన?

(తెరలో సంగీతము)

(ప్రవేశము నారదుడు—సంగీతధ్వనితో)

గేయము.

ఎఱుగరుగా! ప్రభూ!
యీ విశ్వము నీదని
ఎఱుగరుగా! ప్రభూ!
తానని — తనదని
వ్యర్థవిచారము
వరులకు సహజము
నరకసమానము

ఎఱుగరుగా ప్రభూ !
శివుని ఆజ్ఞకే
చీమయైన ఆగును !
వీరు డెవడు యీ
విశ్వంబందున ?
ఎఱుగరుగా ప్రభూ !
యీ విశ్వము నీదని
ఎఱుగరుగా ప్రభూ !

రావ :— దేవమునీంద్రా ! నారదా ! సుస్వాగతము. దయ చేయుడు !

నార :— లంకేశ్వరా ! కుశలమేనా ?

రావ :— పరిహాసమా - నారదా ?

నార :— పరిహాసముకాదు రాజా ! దరహాసమే !

రావ :— ఏమి చెప్పుకొందును నారదా ! నీకు తెలియని విష యమేమున్నది ?

నార :— అన్నియు నాకు తెలియవలెనను సిద్ధాంతమున్నదా రావణా ?

రావ :— మునీంద్రా ! అపజయం ఎరుగని లంకాసామ్రాజ్య మునకు యిన్నాళ్ళకు ఓటమి చేకూరినది ! మృత్యువునుకూడ బెదిరిం చిన నా వీరసంతానమునకు యిన్నాళ్ళకు కన్నులు మూతబడ్డవి !

నార :— రావణా ! (విచారమును సూచించుచు) ఎంతమాట చెప్పితివోయీ ! పాపము - రామసంగ్రామ ఫలితమాయిది ?

రావ :— నారదా ! నా శ్రేయోభిలాషివైన నీవు నా యోగ క్షేమములకు సముచితోపాయము జూపింతువా ?

నార :—చూపించుటకు నే నెంతవాడను రావణా! పరమేశ్వరస్వరూపియైన రామునితో కలహించినావు! పడరానిపాట్లు పడుచున్నావు! ఇది అంతయు నీ ప్రారబ్ధఫలముకాక మరేమి — రావణా!

రావ :—బెదరింపుమాటలకేమిగాని — నారదా! విపద్భారమునన్న నన్ను ఉద్ధరించవా?

నార :—ఒక్కటే మార్గమున్నది రావణా!

రావ :—చెప్పుము — మునీంద్రా!

నార :—

గీ. తప్పుచేసితినంచును ఒప్పుకొంచు
రామచంద్రుని వేడుటే రక్షనీకు!
ప్రాణములపైన పేరాస వరలెనేని
కులమునకు ఖ్యాతి నిల్పగా కోరెదేని
అంజలింపుము — రామ పాదాబ్జములకు!

రావ :—నారదా! నా మనస్సు సంధివచనంబులకు యిష్టపడకున్నది!

గీ. లంకయంతయు జలధిలో గ్రుంకనిమ్ము
రక్కసులజాతి సమసినన్ లెక్కలేదు!
ప్రాణమైనను పోనిమ్ము — రాముదరిని
'దేహి' యనలేను — నేను! సందేహమేల!

నార :—సెబాస్ — రావణా! మాటకు నిలచి — కష్టపరంపరలనైన సహింపనెంచు నీ కార్యదీక్ష వర్ణనాతీతము!

రావ :—మరి నా మనవిని విని నను ధన్యునిజేయరా మునీంద్రా!

నార :—(ఆలోచించి) పాపము — ఆప్తులందరును బలియైనప్పుడు నన్ను సలహానిమ్మని కోరినందుకు చెప్పకుండగలనా—రావణా!

రావ :—మహాప్రసాదము !

నార :—(ఆలోచించి) రావణా ! పాతాళలంకేశ్వరుడు- మైరావణుడు నీ దగ్గఱిబంధువేకదా !

రావ :—చిత్తము.

నార :—అతడు మాయోపాయచతురుడు. ఆతని సహాయము నపేక్షింపుము - వాని సహాయమున నీ సంగ్రామము మఱికొన్నాళ్ళ వఱకు సాగగలదు - ఇంతలో కొంతవిశ్రాంతి తీసికొని బలసన్నద్ధుడవై రామబలమును ఎదిరించగల్గుదువు - ఏమందువు ?

రావ:—(ఆనందముగా) మంచిసలహా నిచ్చితివి నారదమునీంద్రా!

నార:—సరి—నే నికపోయి వచ్చెదను (పాటపాడుచు నిష్క్రమణ)

'ఎఱుగరుగా' అనుపాట.

రావ :—ఔను ! మైరావణుని సహాయమే నా మనోసిద్ధి కుపాయము ! (నిష్క్రమణ)

△

# మైరావణ

## 2

లంకానగరము—రావణుడు, మైరావణుడు ప్రవేశము.

రావ :—పాతాళలంకేశ్వరా ! మైరావణా ! నీ రాకవలన నాకు అపరిమితానందము చేకూరినది.

మైరా :—రావణా ! మనలోమనము ఆ పాటిసంఘీభావము చూపించుకొననిచో రాక్షసజాతికి గౌరమర్యాదలులేవుకదా !

సీ. ఒకమాటపైనున్న యుద్ధాల విజయంబు
కరతలామలకంబు కరణిగలుగు !
ఒకమాటపైనున్న యుత్సాహశక్తులు
నిత్యస్రవంతిగా నెరపుచుండు !
ఒకమాటపైనున్న యున్నతంబగుకీర్తి
రాక్షసజాతికి రక్తినింపు
ఒకమాటపైనున్న యుర్వీతలంబునే
చాపగా చుట్టెడి శక్తియబ్బు !
గీ. మహితసంఘబలంబున్న మనుజుడెవడు ?
'తగుదునమ్మా' యటంచు నీ దాశినడచు
కదనరంగాన నెవ్వడు కాలుదువ్వ
సమసిపోయెనె రాక్షసజాతిసీతి.

చింతచచ్చినను పులుపు చావదుగదా ! ఏ నాడు విభీషణుడు లంకానగరంబు విడనాడి రామునికడ చేరినాడో, ఆ నాడే యింటిగుట్టు

లంకకుచేటని నిర్ణయించితిని. ఆ కుటిలాత్ముని, ఆ రాజద్రోహిని, ఆ విశ్వాసహీనుని, తమ్ముడని గంపెడుప్రేమతో గారవించితివి. ఇంటతిని వాసాలు లెక్కబెట్టిన ఆ కృతఘ్నుని వెంటనే శిక్షించ మఱచితివా రావణా! మన దీపమని ముద్దిడువారున్నారా! రాక్షసజాతికి ముప్పులను చేతులారా కుప్పలు పోయించుచున్నావు.

రావ :—రాముడట – శరణాగతరక్షకుండట – సాక్షాత్పరమేశ్వర విగ్రహమట. యేమేమో భట్టుపొగడ్తలు పొగడి వానినంత నున్నాడు. విభీషణుని శిక్షించుట యెంతపని మైరావణా!

మైరా :—ఆలశ్య మమృతమ్ విషమ్ అన్నారుకదా! చేయవచ్చునులే అని సంశయించి సోమరితనమున ఉపేక్షించుటచేతనే ఆ రాముడు, ఆ నరమాత్రుడు నీ కీదుస్థితి కల్పించినాడు, తగినకాలములోనే మేల్కొనినపక్షమున నీ వీరసంతానమునకు మృతియేలేదు. నీ లంకాసామ్రాజ్యమునకు వినాశమేలేదు. రాముడన్న రావణా గొప్పవాడు కాడు పిఱికిపంద.

సీ. వనవాసదీక్షకు తనతమ్మునింగొని
విహరించుచున్నట్టి పిఱికిపంద!
ఇల్లాలికోసమై యెలుగెత్తి యేడ్చుచు
మతినిగోల్పోయిన మందబుద్ధి!
వీరులనెదిరింప వెఱ్ఱికోతులయండ
ధనమంచునెంచు సద్ధైర్యశాలి!
చెట్టుచాటుననుండి సిగ్గన్నదే లేక
వాలినిగూల్చిన వ్యర్థబలుడు!
గీ. అతడు మానవమాత్రుడు! అధ్యుడొక్కడ!
వానికై యింతవగపేల ప్రథితరాజ!

కాళికాదేవి భుజియించు కమ్మగాను
పీని బలియిత్తు నామెకు వేడ్కమీర.

రావ :—ఆ పనినే నీవు చేసినచో నా కులమును నిలబెట్టినవాడవగుదురు. నా శిథిలహృదయంబునకు మధురరస మొలికించినవాడవగుదువు. నా కటికిచీకటి బ్రతుకునకు దివ్యభాస్కరసందర్శనముచేసినవాడవగుదువు. సాటివాడవై యీ పాటిబంధుప్రేమను చూపినందులకు సదా కృతజ్ఞుడను. మరి నీ కార్యక్రమమును ప్రారంభించు టెన్నాళ్ళకు మైరావణా ?

మైరా :—ఎన్నాళ్ళకో? అనుచున్నావా? మైరావణుని పగ కోడెత్రాచుపగ కాని వ్యర్థమైనదికాదు. రే పీపాటికి రామ మరణవార్త నీకు శ్రవణానందము గలుగజేయును. సంతోషమేకదా!

రావ :—మైరావణా! రామునథ అంతటి తేలికపనికాదేమో నని నా సంశయము.

మైరా :—కొండమాలిన శంకలను పెట్టుకొనుట నేర్చుకొన్నావేమి రావణా!

రావ :—ఏమని చెప్పుదును మైరావణా!

ఉ. నిలకడలేదు చిత్తమున నిర్మలభావము మందగించె! నా
కలవరమేమొ నా హృదిని గట్టిగపట్టుకయున్నదయ్యొ! చా
వులను వినంగనోచితిని వుత్సుకమన్నది లేనెలేదు! నా
కిల సుఖించు బాటలను యేగతిచూపెదొగాని రావణా!

గీ. పెంచి పెద్దవారిగజేసి వేడ్కమీర
మురిసిపోతిని పుత్రుల మోముజూచి
అస్తమించిరి వారెల్ల రాహవమున
బ్రతికియున్నాడ నేను శవంబురీతి!

ఇది నా హృదయదౌర్బల్యముగాని వేరొండుగాదు. సమర్థుడ వైన నీకు చేయరానిదేమున్నది రావణా! వెంటనే నీ కార్యక్రమము నుపక్రమించి విజయలక్ష్మిని పొందుము. రాక్షసజాతికి రక్షనిమ్ము.

మైరా :—రావణా! మాయోపాయమున, ఆ రామలక్ష్మణులను పాతాళలంకకు గొంపోయి, ఆ అసమర్థులను కాళికి బలియిచ్చెదను. త్వరలోనే యీ శుభవర్తమానమును నీవు వీనులవిందుగా వినగలవు.

రావ:—ఆ మాటలు చెవిని పడినజాలును. పరమానందప్రదము గదా!

మైరా :—మన సమావేశము, నా మాయోపాయము, ఎవ్వరికినీ తెలియకూడదు. యీ మాటలు కోటగోడలు దాటకూడదు. వార్తాహరులుందురేమో బహుజాగ్రత్త! మరి నాకు శలవా!

రావ :—నీ కరుణాభిక్షకు ఎదురుచూచుచుందునుసుమా!

మైరా :—ఇవి మెరమెచ్చుమాటలుకావు రావణా! నీవుందుము. (నిష్క్రమణ)

△

# మైరావణ

## 2

యుద్ధరంగ ప్రాంగణము.

ప్రవేశము—సుగ్రీవుడు, ఆంజనేయుడు, విభీషణుడు.

సుగ్రీ :—(ఇరువురితో) విజృంభించిన రావణునిదర్పము చల్లారినది కాబోలు. పాపము హాయిగానుండెడిది లంకాసామ్రాజ్యమునకు కోరి ముప్పు దెచ్చుకొన్నాడు.

ఆంజ :—పాపమని జాలి చూపించెదవేల! యెవనికైనను చేసిన దాని ఫలమనుభవింపకతీరునా? ఎవరి కర్మను వారు అనుభవించవలసినదే. జయింపరానిది, జయింపబడనిది, వ్యక్తిభేదములేనిది, ఆ కర్మ! దానికి దాసుడైనవాడు యీ జీవుడు.

సీ. ప్రజలను హితవుగా పాలింపనేర్చిన
రమ్య సుగుణుండైన రాజుకైన
ప్రజలను హింసించి భయపెట్ట జూచుచు
దోపిడీచేసెడి దొంగకైన
కమ్మనికైతతో ఖ్యాతి నార్జించుచు
మన్ననంగను కవిమాన్యుకైన
హాయిగా గొంతెత్తి ఆలాపనముజేసి
యశము నార్జించు గాయకునకైన
గీ. బ్రహ్మదేవుడు, నొసట ముప్పంక్తులందు
వ్రాయు వ్రాతకు మీరగావశము కాదు

కర్మ కెదురీదగా శక్తి గాంచలేదు
గాన విస్మయపడెదేల కపికులేంద్ర!

రావణుని చర్యలు విన్నచో వానికీశిక్ష చాలునని ఏ న్యాయాధికారి చెప్పగలడు?

సీ. విజనప్రదేశాన వెలయు నా మునులను
పట్టిపీడించిన పాతకంబు
దీక్షగాసాగెడి దివ్యయాగాలను
భంగంబుచేసిన పాతకంబు
పట్టిఅమాయక ప్రజలను హింసించి
వందురగాజేయు పాతకంబు
పరవనితలగాంచి బలవంతపఱచుచు
వ్యామోహతనుజెందు పాతకంబు

గీ. అనుభవింపకతీరునా ఘనునికైన
చేసినమహాపరాధాలు చింతలిడక
సంతసముగూర్చునే! మహాసాధ్వి యుసురు
వంశనాశన కారియై వరలలేదె!

విభీ:— హనుమ నచించినది నిజమైనసంగతి. ఎవని పాపము వానిని పట్టికుడుపకమానదు, చేయునప్పుడు పరమానందముండునుగాని చేసినదాని ఫలితమును అనుభవించునప్పుడు పశ్చాత్తాపము సంభవించును. నిత్యకల్యాణము పచ్చతోరణమన్నట్లు చీకుచింతల నెరుగని రాక్షససామ్రాజ్యమునకు రావణరాజు చేతులార చిక్కులు దెచ్చిపెట్టినాడు. మహాసాధ్వీమణులను మానభంగముచేసిన ఫలితము, సిరపరాధులను నిర్దాక్షిణ్యముగా హింసించిన ఫలితము, సప్తవ్యసనములను సమస్తదురాచారములను ఆహ్వానించి ఆదరించిన ఫలితము యిప్పుడు రావణుండనుభవించుచున్నాడు. అతని దుస్థితికి జాలిపడుట యనవ

సరమే. హింసాపథంబున రక్తప్రవాహములలో మునుకలిడిన ఆ మానవ రాక్షసుని దుస్థితికి యే వ్యక్తియు సానుభూతిచూప నవసరములేదు.

ఆంజ :—సానుభూతి యెవరికోయి విభీషణా! రామభక్తులపై యెదిరింప ప్రయత్నించిన రావణునిమీదనా సానుభూతి. వెఱ్ఱివాడై రామభక్తిని గ్రహించలేకపోయినాడు. రామభక్తుల శక్తిని వూహించ లేకపోయినాడు.

సీ. కడలేని జలధికి గట్టు కట్టించిన
రమ్యతరంబైన రామభక్తి
ఆకలిబాధను అడుగంట జేసిన
రమ్యతరంబైన రామభక్తి
ప్రతికక్షిబలమును వ్రయ్యలుగా జేయు
రమ్యతరంబైన రామభక్తి
హింసాపథంబును యెదిరించి గెల్చిన
రమ్యతరంబైన రామభక్తి
గీ. శక్తులన్నింటికినిమించి రక్తినిచ్చి
లలితమౌ ముక్తి గూర్చు నీ రామభక్తి
వంచకుల నేలగూల్చెడి ప్రథితశక్తి
రావణుని పాలిమిత్తి! యీ రామశక్తి!

విభీ :—పావనీ నిరుపమానంబైన రామభక్తుడవు, రామకథా సుధనుగ్రోలి మేనుమఱచెడివాడవు. శ్రీరామచంద్రుని నమ్మినబంటువు! నిజముగా నీవు కోతివిగావు. రామచంద్రునిపాలిటి ఆశాజ్యోతివి! రావణసంహారణము, సీతామహాసాధ్విని శ్రీరామచంద్రున కర్పించుట— యీ రెండేకదా సశేషమైయున్నవి.

ఆంజ :—ఔను విభీషణా! ఆ రెండుపనులే తయారుగానున్నవి.

సీ. కూయుచున్నది నేడు హాయిగా తీతువు
లంకావిభూతికి శంకజూపి!

ఆడుచున్నది నేడు కీడులదేవత
దైత్యసంతతికిని మృత్యువీయ!
పారుచున్నది నేడు పరివాహరుధిరంబు
గతజీవులైన రక్కసులుగూల
ఎగురుచున్నది నేడు యీ మాయగృధ్రంబు
రాక్షసశవముల భక్షణమున!

గీ. శక్తి గోల్పోయినట్టి రాక్షసపతాక
అదిగో చింపిరిగుడ్డయై చెదిరిపోయె!
కీర్తిగానుండెనా నేడు రావణుండు
తలచుకొనలేదుకాబోలు తనదుముప్పు!

యీ నిరాధారమైన బోల్లిధైర్యము తన జీవితాంతమునకేగాని వేరొండుగాదు.

సీ. తన జాతివీరులు తలలను గోల్పోయి
మొండెంబుతో భువిన్ పండినపుడు
తన శూరపుత్రులు తమ జీవములవీడి
హేయంబుగా కళ్ళు మూయునపుడు
తనముద్దుకోడళ్ళు దైన్యవైధవ్యాన
యెలుగెత్తి జాలిగా యేడ్చునపుడు
తనరాజ్యవీధుల యినుపగజ్జెలతల్లి
నాట్యంబుసేయుచు నడచునపుడు

గీ. రామశక్తిని గుర్తించు లాగులేదు
ఉన్నవారిని నిలబెట్టుటన్న లేదు
నిజబలంబును గుర్తించు నేర్పులేదు
పతనమందున యెందుకీ పంతమింత.

(తెరలో సంగీతము)

గేయము.

పరహింసాఫల మనుభవింపకే
బ్రతుకు సాంతమగునా!
పరహితమనునది లేనేలేక
నిరతము పాపిగ నిలుచుట తగునా! ॥ పర ॥
సాటిసతీమణి కంటికగుపడక
పరిపరి-కామము చూపన్యాయమా! ॥ పర ॥
సత్యమహింసా సద్వ్రతములగను
నిత్యసంతోషనిధి గనవలదా! ॥ పర ॥

( పాటపాడుచు నారదమునీంద్రుడు ప్రవేశించును )

అందరు :—నారదమునీంద్రా నమస్కారములు!

నార :—సంకల్పసిద్ధిరస్తు!

విభీ :— దివిజమునీంద్రా! శ్లేషోక్తులను వాడుచున్నారా?

నార : శ్లేషోక్తియను మాట మీకెట్లుగల్గినదోగాని, యథార్థమునే వచించితిని.

సుగ్రీ :—మహాత్మా—రామరావణ సంగ్రామ మధ్యమున నున్నాము!

నార :—మంచిచోటనే యున్నారు. నిరుపమానమగు రామ కార్యదీక్ష మీలో మూర్తీభవించియున్నది. మూఢులు-అజ్ఞానులు శ్రీరామచంద్రుని మానవమాత్రునిగా తలంచుచుందురు—

సీ. భారతదేశాన ప్రభుని గృహంబులో
పసిబాలుడై పుట్టి వరలుచున్న
చీకుబడినయట్టి శివుని ధనుస్సుని
విరిచి పెండ్లాడిన వీరుడైన

యజ్ఞయాగాదుల యతిశయ ప్రేమతో
గాచి రక్షించిన ఘనుడునైన
తండ్రిమాటను నిల్ప తరుసంతతులమధ్య
మునివేషధారియై మూగుచున్న

గీ. రామచంద్రుడు మనుజుడే యటంచు
వట్టి పుక్కిటిగాధల పలుకునట్టి
మూఢులకు శ్రీరామమూర్తి శక్తి
వంటపట్టుట యనినచో వట్టిమాట!

అంతటి తెలివితక్కువవాడిలో అధమాధముడుగా రావణ రాజు. తనతప్పును గుర్తించక పచ్చనికొంపకు చిచ్చు తెచ్చుకొన్నాడు

విభీ :—ఔనుమహాత్మా

నార :—రామభక్తులారా! మీ ముఖవికాసములు జూచినచో కడలి యీది గట్టు నెక్కినట్లుగా కన్పడుచున్నది. విజయోత్సాహమున విఱ్ఱవీగుచున్నట్లు కన్పడుచున్నారు—కాని మీ శక్తి నిపరీక్షించు మరొక రసవత్తరఘట్టము రణరంగమున ఆరంభము కానున్నది—

సుగ్రీ :—నారదమునీంద్రా! మీ వచోరచన కడు చిత్రముగా నున్నది—

నార :—చిత్రమో—విచిత్రమో! విన్నదానిని—కన్నదానిని విన్నవించితిని. రామశక్తిని గైకొన్న రామభక్తులుమీరు! మీరు అన్నివిధంబుల తోడునీడగా నుండుటయే నా మతంబు. అందువల్లనే యధార్థమును వినిపింపవచ్చినాడను—

విభీ :—మహాత్మా—వివరములను వినిపించెదరా!

నార : – వివరముల చెప్పుటకేగదా—నేనువచ్చినది!

గీ॥ ఎఱుగరే మీరు పాతాళ మేలువాని
మహిత మైరావణాఖ్యుని మాన్యమతిని

వాని సాహాయ్య మర్థించి—భండనాన
విజయమందుట రావణు వేడ్కయయ్యె !

ఆంజ :—(పకపకనవ్వి) పదితలలరావణుని పస బయటబడినది ! ఇంక పాతాళ లంకేశ్వరులకు పరాభవము మిగిలియున్నది.

నార :—మారుతీ ! బలసంపన్నుడవైన నీ మాటను కాదన లేను—కాని కదనరంగమున రాజకీయములు చిత్రవిచిత్రమైన నడకలతో సాగుచుండును !

ఉ. రావణు దైన్యదుస్థితికి .. లాలనజేసి దయాస్వభావుడై
"చేవనుచూపి రామునకుశిక్షవిధించెద—తల్లి - కాళికా
దేవికి కాన్కనిచ్చెదనుదిట్టరికిన్దటుతప్ప జేయునో
రావణుశక్తి నెంచుటకురాములు వేవురు చాలరం"చనెన్
అంతేకాదు పావనీ ! మరియొక ప్రతినకూడా చేసినాడు —

గీ. రామలక్ష్మణమూర్తుల ధీమతులను
యిపుడె పాతాళలంకకు యీడ్చితెచ్చి
నిలుపుకొందును మాజాతి నిండుకీవి
యంచు యేమేమొ దల్పె నా యసురవరుడు !

విభీ :—మహాత్మా—శాంతిల్లిన ఆవేగములు మరల వ్యుత్పన్నమగుచున్నవి. విపత్కాలమున మాకు తగిన సదుపాయము చేయ నేడుచున్నాను— రామభక్తులైన మీరుకూడ రామరావణ సంగ్రామము విజయవంతముగా కొనసాగునట్లు జేయ సంప్రార్థించుచున్నాను

నార :—రామభక్తులారా ! సదుపాయమైనను—సలహాయైనను మీరడిగిననాడు కాదనలేను—పాపము రాజకుమారులైన రామలక్ష్మణులు అలసి నిదురించుచున్నారు— యీ సమయమునే ఆధారముగా చేసికొని మైరావణుడు రామాపహారణమునకు ముందంజవేయును. కాబట్టి మీలోభలశాలురైన వారందరు వంతులుప్రకారము-

నిద్రాసక్తులగు యీ రఘువీరులను పహరా పట్టుడు—జాగరూకులై కాపలా కాయుడు. అప్పుడు మైరావణుని మతకము మట్టిపాలు కాగలదు

ఆంజ:—శ్రీరామచంద్రా! నిన్ను అపహరింపగల్గిన నేర్పరి యున్నాడా?

విభీ:—ఆంజనేయా నన్ను మన్నించవలయును. రామకార్య నిర్వాహణమున నిన్ను మించినవారు లేరు! నీవే ఆ శ్రీరామచంద్రుని నకును—ఆ లక్ష్మణమూర్తికిని కన్నాకుగా గాపాడగల బలశాలివి—

ఆంజ:- నన్నేల పొగడెదరు! రాఘవేయులకు నేను దాసాన దాసుడను!

ఉ. లోకను పెంచివైచెదను దొడ్డ భవంతిగ చుట్టిపెట్టి—క
న్నాకుగ రాఘవేంద్రులకు అండగనుందును-వచ్చువాని చీ
కాకుల పాలుచేసెదను కాలునికిన్ బలిదాన మిచ్చెదన్
వ్యాకులమందనేల పరివారము రాముని క్షేమవార్తకున్.

నార:—భేష్ - రామభక్తశిరోమణీ - పావనీ - నీ ఉపాయము ప్రశంశనీయము పుణ్యులారా మీరందరు జాగరూకులై మెలంగుడు-శలవు.

(పాటపాడుచు నారదుని నిష్క్రమణ)

గే యం

నరునిశక్తియే ఘనతరమనుచును
నమ్ముట జగతిని వమ్ముగదా
భవ్యుడైన పరమేశ్వరు ప్రతిభను
మతి విడనాడుట మౌఢ్యమురా!
తానెవడో తెలియువానికే
తత్వము విశదము యగునుకదా!

— నిష్క్రమణ —

△

# మైరావణ

## 4

రణరంగస్థలిని మరొకప్రదేశము.

మైరావణుని ప్రవేశము.

మైరా :—(ఎదురుగా చూచి) ఔరా ! యీ కోతి తన తోకను పెంచి పెద్దదానిగాజేసి భవనమువలెజేసి పైన కూర్చునియున్నది. పాపము అంతమాత్రముతోడనే రామలక్ష్మణుల ప్రాణములు వారికి దక్కునని కాబోలును దానియూహ !

సీ. ఇట్టి కోతులు వేలు యెదిరింపవచ్చిన
మైరావణునిదీక్ష మాయమగునే
ఇలవేల్పులందరు యేకమై నిల్చినన్
మైరావణదీక్ష మాయమగునే
రాముడు గీముడున్ రణమందు నిల్చినన్
మైరావణదీక్ష మాయమగునే
కౌసలా లెన్నైన ఘనసూరులున్నను
మైరావణునిదీక్ష మాయమగునె
గీ. చతురపన్నాగములతోన శక్తియున్న
వినుత పాతాళలంకేశు పేరువిన్న
నిలిచి ధైర్యాన యెదిరించగలుగుతాడు
పుట్టలేదింక ! ముందైన పుట్టబోడు !

అమాయకతతో యీ కోతి లంకేశ్వరునకు ఆహుతియగునేమో యని విచారించుచున్నాను. (ఆలోచించి) యీ కోతి నిజముగా తెలివి తక్కువదేకాని తెలివిగల్గినదికాదు.

గీ. తోకచుట్టుకు శిఖరాన తోషమలర
నిలిచి కూర్చున్న దీకోతి తెలివియెంత ?
నేల దొలిచెడి కళలందు నేర్పుయున్న
మాయమైరావణునిశక్తి మనసుకెక్క
పట్టికోతికి తరమౌనె వసుధయందు !

నే నిపుడే బిలప్రవేశముచేసెదను—ఆ కోతిగాని వ్యూహాలకు అందనిరీతిగా ఆడమానాభవంతితో ప్రవేశించెదను. అందున్న రామలక్ష్మణులను యిదేగొనివచ్చెదను. (అటు చూచి) ఓరీ సేవకులారా !

(ఒక పెట్టెతో యిరువురు సేవకులు ప్రవేశము.)

సేవ :—చిత్తము దేవా !

మైరా :—నేను వచ్చెడివఱకును మీరిక్కడనే యుండవలయును. ఆ పెట్టెను నా కిమ్ముడు—యీ ప్రాంతమున మీరున్నట్లుగాని నే నున్నట్లుగాని పిట్టకైనను తెలియకూడదు. మిమ్ముల నెదిర్చిన కోతినిగాని నరమాత్రునిగాని నిర్దాక్షిణ్యముగా చించి చెండాడి గృధ్రజంబుకములకు అల్పాహారవిందొసంగుడు ! ఆ పెట్టెను నా కిమ్ముడు !

సేవ :—చిత్తము దేవా !

(పెట్టితో మైరావణుని నిష్క్రమణ)

1వ సేవ :—అన్నా ! మాయలరాయడైన మన మైరావణుని శక్తికి యెదిరించగలుగు మొనగాడే లేడుగదా !

2వ సేవ :—(ఎదురు చూచి) ఔనుకాని—అటుచూడరా.

1వ సేవ :—(ఎదురు చూచి) మాయమై ఆ తోకకోటలోనికి ప్రవేశించినారట్రా మన ప్రభువులు !

2వ సేవ :—(ఎదురు చూచి) పాపం— ఆ కోతికి తెలియదురా.

1 సేవ :—(ఎదురుచూచి) అయ్యో ! క్షణకాలములోనే పెట్టెతోవచ్చుచున్నారురా ప్రభువులు.

2వ సేవ :—ఇంక రామలక్ష్మణుల ఆయువు తీరిపోయినదిరా.

1వ సేవ :—ఔనురా – మైరావణునిచేతజిక్కినవారిగతి అంతే కదా.

(పెట్టితో మైరావణుని ప్రవేశము.)

మైరా :—ఆయాసము తీర్చుకొని) మైరావణుని పన్నాగము తీరినది – ఆతని వాగ్దానమునకు శుభోదయమైనది. నా మనస్సునందు గల ఆందోళన శాంతించుచున్నది. ఔరా! మైరావణశక్తిని ప్రతిఘటించుటకు ఆ కోతికి శక్తిలేదుగదా! ఏదో రక్షకుడనని బడాయిగొట్టిన ఆ కోతికి తగినపరాభవ మందినది – రాముడో – గీముడో! – చూచెద గాక!

సీ. ఈ రాముడేగదా యింతి శూర్పణఖకు
ముక్కుచెవులగోసి చిక్కుపెట్టె!
ఈ రాముడేగదా హితుడు మారీచుని
జాలిని విడనాడి చంపివైచె!
ఈ రాముడేగదా యిసుమంతదయలేక
కుటిలుడై లంకను కొల్లగొట్టె!
ఈ రాముడేగదా హేయయుద్ధాలకు
కారణభూతుడై గజ్జెకట్టె!

గీ. పెద్దవాడైన రాక్షసవిభుని మనసు
నొవ్వజేసిన రాముని నొసటివ్రాత
మాయమైరావణునిచేత మరణమనుచు
బ్రహ్మదేవుడు యేనాడో వ్రాసినాడు!

తెలివితక్కువరాముడు – ప్రాణములను గోల్పోవనున్నాడు. అతి తెలివి అన్నివిధముల నష్టమునే చేకూర్చును! యుద్ధమనుమాటలేక

రావణరాజును మంచిచేసికొన్నచో నితనికి ప్రాణాల హరియించుపాట్లు లేవుగదా! ఎవరికర్మకు వారేగదా నిర్ణేతలు ఇంక కాలహరణము చేయకూడదు (ఎదురుగా చూచి) ఓరీ సేవకులారా! యీ పెట్టెను గొంపోవుడు – మీ వెనుకనే వచ్చెదను – బహుజాగురూకులై మెలంగవలయును. తెలివితక్కువగా విహరించినచో మీ ప్రాణంబులు మీకు దక్కవు – పొండు!

సేవ :—చిత్తము దేవా.

మైరా :—ఓరీ వానరాధమా!

గీ. కాపలాకాయు మొనగాని కన్నమించి
నిలిచియున్నావు వానరా! నిజముగనవు!
ఎందుకోయబ్బి యింకను యీ శ్రమంబు
లేదు నీ చెంత – రాముడు! లేడు – లేడు!!

(అందరు నిష్క్రమణ)

△

# మైరావణ

## 5

(రణరంగ స్థలమున ఆంజనేయుని కావలాఘట్టము.)

ప్రవేశము ఆంజనేయుడు.

ఆంజ :— (తనలో) రామలక్ష్మణులను అపహరించెదనని డచ్చీలుకొట్టిన పాతాళలంకేశ్వరుని ప్రతాపము చవిచూచుట కవకాశము లేకపోయినదికదా ! ప్రపంచధోరణి అంతియేకదా ! చెప్పుట యెవరికైనను సులభమేకాని చేయుటలోమాత్రము కష్టము కనిపించును – బలాధికులయిన రాఘవేంద్రుల నెదిరింపగల్గువాడు మైరావణుడా (పకపక నవ్వును)

ఉ. రాముని కాళికిన్ బలిగ రక్తినొసంగెదనంచు నెంతయో
నీమముగా వచించితివి నేర్పరివై యెటుబోతిరావణా !
కామితమేడగూర్చితివి కావలయుండిన మారుతాత్మజున్
పామరిగాదలంచితివె శత్రుభయశక్కుల చంపనెంచితే !

ఉ. తేలికగాదు రాఘవుల దివ్యమనీషుల చంపనెంచుటల్
వాలిని గూల్చినట్టి బలవార్నిధి రామునిముందు రావణా
యేలర నీ పరాక్రమము ! యెంతటిబుద్ధివిహీనరీతిగా
ఆలమునందు నిల్చుటకు ఆసలపెంచితివోయి మూఢుడా !

ఉ. రక్కసరాజ్యమంతటికి రక్తపుటేరులు కాన్కలయ్యె – నీ
వెక్కడనుంటివో యెఱుగ ! నింతటి వీరుల మ్రింగజూతువా !
చక్కని రాజ్యసంపదకు చావునుగూర్తువె ! నీతి నిల్పవే !
యిక్కడికేగుతెంచునెడ నేమగునోయనియెంచు రావణా !

(తెరలో సంగీతము)

గేయము.

ఆవేశముతో అవకాశంబుల
పాడుచేసుకొనకే - మనసా
నిజము గ్రహింపగ నేర్పునుగనవే
మాయోపాయము మాటలవినవే ॥ఆవే॥
లేనిపోని మూఢతగనకే
మైన దారినే నడువనూనకే! ॥ఆవే॥

(ప్రవేశము నారదుడు.)

ఆంజ :—నమస్కారము నారదమునీంద్రా!

నార :—సుఖీభవ!

ఆంజ :—దేవమునీంద్రా! విశేషములను విన్నవించెదరా?

నార :—విన్నవింపవలసినది నీవా? లేక– నేనా?

ఆంజ :—నేనేమి వచింపగలను మునీంద్రా!

ఉ. హాయిగ వీణమీటుచును అందరిసేమము జూచువాడవై
మా యిలవేల్పువై గగనమార్గమునన్ విహరించు నీకు ఆ
మాయలమారి రాక్షసుల మంతనమంతయు గోచరించు! ప్రా
ర్థేయపడేటివారలకు దివ్యమునీంద్రుడ! బాంధవుండవే!

చ. దశరథరామునిన్ గొని, ముదంబున కాళికి కాన్కనీయగా
యశమును బూనగా పలుకు నాతని రావణు జాడలేదు! యీ
నిశి యెటుయేగునోయనుచు నిల్చితి రక్షణదీక్షమీరగా
పస యికతేలిపోయినది! పాపము రావణు థాకయింతెగా!

నార :—పాపము! నిజానిజములు తెలియవుకాబోలు! మైరావణుడు! అటులైన – ఆంజనేయా! రామచంద్రునకు క్షేమమేకదా!

ఉ. రక్కసమాయలన్న గనరానివి సుమ్మవి, జ్ఞానశ్రీనిధిన్
చిక్కులలోన జేర్చు జగజెట్టులు ! వారలనిల్చి గెల్చు నీ
యొక్క పరాక్రమంబనగ యున్నతమైనది ఆంజనేయుడా
యెక్కడనుండె రాఘవులు ? యీ దినమంతున వారి గాంచితే!

ఆంజ :—మహానీంద్రా ! అంతసంశయమెందులకు ?

ఉ. ఈగకు చేరరాని యటులీతరి వాలముచుట్టినాడ ! నా
వేగము మీఱ, వచ్చుచును వెళ్ళెడివారిని పల్కరించుచున్
రాగము తాళబంధమున రాముని కీర్తన సల్పుచుంటి న
న్నేగతి మోసగించగల డెంతటి రావణుడైన నారదా !

ఉ. స్వామి రఘూత్తముండట ప్రశాంతముగా పవళించినాడు ! నిం
కేమి భయంబులేదు, పలుకేలనో హేళన బాటబట్టె ! మా
రాముల జూతువేని యిటరాగదవోయి మునీంద్ర ! రాక్ష
స్వాముల పట్టునెగ్గనేని సంశయమందితివేమొ – నారదా !

నార :—పావనీ – నాకుమాత్రము నమ్మకములేదు.

ఆంజ :—(తోకను లాగివేయును)

(ఆశ్చర్యచకితుడై ఆంజనేయుడు అచ్చట రామలక్ష్మణులు
లేకుండుటను చూచి ఆందోళనచెందును.)

నార :—పావనీ ! (బిగ్గరగా) పావనీ !

ఉ. పాపము రాఘవేంద్రుల కపాయముతప్పినదంచు నెంచితీ
మాపటివేళదాక, అనుమానమునైన నెరుంగవయ్యయో !
కాపరివైన నీకు కలకాలము నీ యపవాదు గూడెనా !
యేపని చేయగానిపుడు హెచ్చరికైనదిగాదు పావనీ !

చ. ముదపడినావు నీవు కలమోస మెఱుంగని వెఱ్ఱివాడవై
యిదియొక రాక్షసాధముల హేయపుకార్యమటంచు నెంచవే

వదలని కార్యదీక్షగలవాడవు! రక్కసమూకతోడనే
కదనము సంభవించినది! కావున రావణ లంక కేగుమా!

గీ. అచట పాతాళలంకలో అబ్బురాన
రామచంద్రుని కాళికి రక్తిమీర
బలియొసంగెడి రావణువాంఛమాట
మఱచిపోవకు మారుతీ! మాన్యచరిత!

ఆంజ:—(క్రోధావేశమున) ఓరీ - మైరావణా! అహింసావ్రతంబు అంతటి, శక్తిహీనమనుకొనుచున్నవా? మనవైపునకురాని మైరావణుని వధించుట పాడిగాదనుకొని నిన్ను పేక్షించితిని. ఆ నాడే నిన్ను వధించినచో చిలిపిచేష్టలకు తావులేదుగదా!

ఉ. దొంగవిధాన చేరితివి దోర్బలమంతయు గంగగల్సె! నీ
యంగనపూర్వపుణ్యమున ఆయువుకూడ్చినదోయి రావణా!
రంగమునందుజొచ్చుట పరాక్రమమౌను! యిలాటి బాటలా
యెంగిలి తిండికేచనెడి హేయపు నీ బ్రతుకు కెంతగొప్పరా!

గీ. ప్రతినబూనితి మా రామభద్రుకొఱకు
ప్రాణమైనను బలియిత్తు రాణమీర
మాయమైరావణా! నీకు మరణమిత్తు!
శాంతిచెందదు పావని జన్మకక్ష!

నార:—పావనీ - కంకణముగట్టి - రామలక్ష్మణుల క్షేమమునకై పాటుపడుము - రాక్షసమూయలకు లొంగకుము - ఇదియే నా హితోక్తి.

(నిష్క్రమణ)

△

# మైరావణ

## 6

సముద్రతీరము :

ప్రవేశము—ఆంజనేయుడు – విభీషణుడు – సుగ్రీవుడు.

సుగ్రీ :—రామభక్తాగ్రణీ – పావనీ – నీ వేలకో ఖిన్నుడవై యున్నావు. బలసంపన్నుడవైన నీ విట్లు విచారగ్రస్తుడవై యుండుట కడుం గడు శోచనీయముగానున్నది—మారుతీ నీ విచారకారణము నెఱిగింపవా!

విభీ :—నీవు సమధికోత్సాహివై యున్నంతవఱకు కపిసేనలు ద్విగుణీకృతోత్సాహముతో నుండును. నీవు విచారగ్రస్తుడవై యున్నచో మా కెవ్వఱకును చేతులాడవు – హనుమా ! నీ యనుమానము యెందులకో యెఱిగింపవా ? మా మనవి వినవా ?

ఆంజ :—రామకార్య దురంధరులారా ! యేమని చెప్పుదును ! యేరీతి దెల్పగలను ? యేమనుటకైనను నాకు నోరాడుటలేదు – మహాపాపాత్ముడను – ద్రోహిని – సుగ్రీవమహారాజా నన్ను శిక్షింపుము – రాజదండన పాతకనాశనకారి.

సుగ్రీ :—హనుమా ! నీ మాటలు మాకు బోధపడుటలేదు – నీ ధోరణి చూచినచో మాకు చాలవింతగానున్నది – కలసంగతిని చెప్పినచో – విషయమును విశదపఱచినచో – నీ మనోక్లేశమును బాపుటకై ప్రయత్నించెదము మారుతీ ! సందేహింపకుము – నీవు వృధావిచారమున ఆరోగ్యమును చెడగొట్టుకొన్నచో భావికార్యక్రమము భంగ

పడును – ఆశాజ్యోతివలెనున్న విజయోత్సాహము అంతమొందును – కపికులసామ్రాజ్యమునకు స్వేచ్ఛాభిక్ష నొసంగనెంచవా? రామసమరోత్సాహివికావా? భక్తిపరుడవు – బలశాలివి – ధీరుడవు – నిన్ను కలవరపెట్టుచున్న బాధయేదో విశదీకరింపుము – నీ నైరాశ్యఘణతికి హేతుకమును దెల్పుము.

విభీ:—హనుమా! కపికులేంద్రుని వచనంబుల మన్నింపుము

ఆంజ:—మహాత్ములారా!

ఉ. రాముడు లేడు నేడిచట రాక్షసబారికి చిక్కినాడు! ఆ
ప్రేమమయుండు క్రూరులకు విందగు నన్న భయంబుమీరె! దు
ష్కాముడు రావణాసురుడు కాళికి కానుకగ జేయునేమొ! నే
నేమని చెప్పుకొందునిక నేటికి నా బలమిట్లు గూలెనో!

విభీ:—(విచారముగా) రామ! రామ! ఎట్టివార్తను వినిపించితివి మారుతీ! అతిసుకుమారులైన రాకొమరులు మన రామలక్ష్మణులు మాయలమారియైన మైరావణునిబారికి చిక్కెనా! ఔరా! విధి బలీయమైనదిగదా!

సుగ్రీ:—అయ్యో! ఆంజనేయా! ఎంతపని జరిగినదోయీ! భవనముగ నిర్మించిన నీ వాలమునకు చిక్కవడక, బలశాలివైన నీ కన్నుల కగుపడక – ఆ మాయమైరావణుడు రామచంద్రుని యెట్లు అపహరించెనోగదా! లలితకోమల విగ్రహములైన రామలక్ష్మణులు పాతాళలోకమున నెట్టిబాధలపడుచున్నారోగదా! పాడుమైరావణుడు పట్టు నెగ్గించుకొన్నాడు – బలవిభవోపేతులైన కపికులంబునకు గట్టిదెబ్బ కొట్టినాడు – రామాపహరణము మన వనచరజాతికే గట్టిదెబ్బ! హా సీతారామా! హా జానకిరామా! అయ్యో (మూర్ఛిల్లును)

విభీ :—అయ్యో! సుగ్రీవుడు ఆవేశపూరితుడై రామచంద్రుని దుస్థితికి విలపించుచున్నాడు – పావనీ యీ విభీషణునకు పరిచర్యల చేయుదము రమ్ము.

(ఇరువురు సుగ్రీవునకు శీతలోపచారముల చేయుదురు)

సుగ్రీ :—(లేచి) హనుమా! మన రామునిగతి యింతేనా – మన లక్ష్మణమూర్తి మనకంటికగుపించడా! అయ్యో! ఆ సుకుమార శరీరులు కాళికి ఆహుతి కావలసినదేనా! మారుతీ! నీవు పలుకాడ కున్నావు – మౌనము వహించినావు – నాకు మనశ్శాంతినిచ్చుమాట లను దెల్పవా! మన భావికార్యక్రమమును నిర్దేశింపవా – మాటాడ వేమి మారుతీ!

ఆంజ :—సుగ్రీవా! అధైర్యపడకుము!

ఉ. రాముఁడు మానవుండనుచు రావణుడెంచెనుగాని – ఆ
ధీమహితాత్మునిన్ గెలువ తేలికయీపనిగాదు – నమ్ముమా!
రాముని కెగ్గు నెంచుటలు రాక్షసజాతికి చిచ్చుపెట్టుటల్
ఆ మతిమాలిసట్టి పనులంతకు శిక్షలభింపదా ప్రభూ!

చ. సుగుణసమేతులీధరను గ్రుక్కుట సాజము! దుర్గుణాత్ములే
జగతిని స్వర్గసౌఖ్యముల సంపదనింపుదురంతలోపుగా
సుగుణము నాశనంబగునే! చోద్యము దుర్గణమే హరించుగా!
వగచుటమానుమా! హనుమబంటుగనుండగ, రామమూర్తికిన్
అగుపడు నా పరాభవము! అంతకుచింతిలదేలనో ప్రభూ!

సుగ్రీ :—హనుమా! నీవు సమర్థుడవే కావచ్చు! నిజమైన రామకార్యనిర్వహణాదురంధరుడవు కావచ్చు! శక్తికి ప్రతిశక్తి గల్పించ గల మహనీయుడవు కావచ్చు – కాని రామచంద్రుని క్షేమమున కై తత్తరపడుచున్న నాకు అధైర్యముగానున్నది.

విభీ :—ఆంజనేయా! బలశాలివైన నీకు చెప్పనవసరములేదు. వెంటనే పాతాళలంకకు పయనంబై శ్రీరామచంద్రునకును రామలక్ష్మణులకును యిక్కట్లులేని క్షేమసమాచారమును వినిపింపవా? వారిని సుఖీభూతులజేయవా? మారుతీ! ఆలశింపకుము – మాయలకు నిలయమైరక్కసులు మనరామచంద్రునకు బాధల గల్పించుచున్నారేమో!

ఆంజ :—అటులైన – నేనిదే పాతాళలంకకు పోవుచున్నాను – మీరు జాగరూకులైయుండుడు – మాయలకు ఆధీనముగాకుండుడు. పాతాళమునుజొచ్చి – మైరావణుని శిక్షించి – శ్రీరామమూర్తిని సేవించి వచ్చెద!

ఉ. మారుతి దృష్టిలోబడిన మంటలలోబడినట్లుగాదె! చే
కూరెడి యాపదన్ననక కొంపను యేటిని గూల్చుకొన్న యీ
క్రూరుడనీ రాక్షసాధముని గూల్చెదుదాకను రెప్పవాల్చునా!
మీరు వృథావిచారముల మీరక హాయిగనుండుడీయెడన్.

గీ. పవననందనుడను నాకు భయములేదు
సింహబలుడను నాకగుచేటులేదు
రామభక్తికిదాసుడ రావణుండు
యేమిచేయగలేడు మీకేల వగలు!

(నిష్క్రమణ)

# మైరావణ

## 7

పాతాళలంక ద్వారము.

ప్రవేశము—ఆంజనేయుడు.

ఆంజ :—హౌరా ! కనుచూపుల కగపడుచున్న యీ లంకా సామ్రాజ్యవైభవము వర్ణనాతీతముగదా ! ఎటుచూచినను ఆనందమే! ఎటుచూచినను సంతోషమే ! మాటలలోనైనను చేతలలోనైనను ఆలోచనలోనైనను వీరికి ఆనందమేకాబోలు – అనాగరికులైననేమి – హింసాపరులైననేమి జీవితమును సుఖవంతముగా జేసికొనుచున్నారు. ఈ రాక్షససామ్రాజ్యమును చూచినచో నయనానందకరముగ నున్నది.

సీ. అవిగో కన్పడుచుండె నద్దాలమేడలు
రాక్షసజీవికి సాక్షియటుల !
అవిగో విన్పడుచుండె ఆనందవచనాలు
అసురసమూహంపు ఆస్తియనఁగ !
అవిగో యెగురుచుండె ఆ నిండుజెండాలు
సర్వస్వాతంత్ర్యంబు సాగునటుల !
అవిగో పండువయ్యె ఆ పిల్లవీరుల
సాము గరిడీఁజేయు సాధనంబు !

గీ. సకలసంపదలకు నింతసదనమైన
లంకనున్ గాంచగా నాకు శంకయయ్యె
అట్టి రాక్షసజాతి కీపట్టణంబ !
వంచకుల జీవిగనగ సంకోచమొదవు !

సూక్ష్మరూపములను ధరించి యెట్టకేల కీపాతాళలంకా ద్వార మునకు జేరితిని. ఇక యిటనుండి పురప్రవేశ మొనర్పవలసియున్నది. అడుగో యెవడో యీ దరినేవచ్చుచున్నాడు — అతని నడిగినచో కొన్ని వివరములు తెలియుట కవకాశమున్నది.

(ప్రవేశము—మత్స్యవల్లభుడు)

ఓయీ! నీ వెవరవో తెలియవచ్చునా ?

మత్స్య :—అంతయు తెల్పుటకే వచ్చినాను.

ఆంజ :—నీ మాటలట్లుండుట చిత్రముగానున్నదే !

మత్స్య :—చిత్రమేమరి — అంతకన్న విచిత్రమైనది మరొక టున్నది.

ఆంజ :—దానినికూడ తెల్పినచో విని ఆనందింతును !

మత్స్య :—శాశ్వతానందంబు పొందెదవులే !

ఆంజ :—సీ. మంచిమర్యాదయు నుంచకుండ నిట్లు
చులకనజేయుచు పలికెదేల ?

మత్స్య :— మంచిచెడ్డలులేక మా యాజ్ఞనందక
యీ రీతి లోనికి నేగదేల ?

ఆంజ :— తప్పేమి మీ రాజ్యదర్శన మర్థింప
చూడగా నిందున్న చోద్యమేమి ?

మత్స్య :— తప్పేమి కోతులతలల ఖండించిన
అవినీతి నడగింత యబ్బురంబె !

ఆంజ :—గీ. వచ్చువారలతోడ నీ భాషణములు
గొప్పయనుకొంటివేమొకో కుఱ్ఱకుంక !

మత్స్య :— కుఱ్ఱకుంకలమైనను బుఱ్ఱగలదు
యిట్టికోతుల నదలుట వట్టిమాట !

ఆంజ :—(తనలో) వీడు అసాధ్యునివలెనున్నాడు. వీనిసిచూచి నప్పటినుండియు నా కేదో బాదరాయణసంబంధమున్నట్లు దోచుచు న్నది – అగుపడని ఆపేక్ష వీనియెడ ఆవర్భవించుచున్నది – పోరాడు టకు భుజబలము వెనుకంజవేయుచున్నది.

మత్స్య :—ఓ వనచరా! తెలియక తప్పుచేసితివి. యీ నగ రంబున కాలుపెట్టినవాడు కాలునకు బలియగును! యీ నగరద్వార పాలకుండైన యీ మత్స్యవల్లభునిశక్తి – పాపము – నీకు తెలియలేదు. అమాయకుడవైన నిన్ను నిర్దాక్షిణ్యముగ వధించుటకు నా మనసొప్ప కున్నది. కాన – నీవు వెంటనే పలాయనంబు సాగింపుము – లేనిచో నీ ప్రాణంబులు నీకు దక్కవు!

ఆంజ :—అంతటి జాలిపడనక్కరలేదోయీ! పరమేశ్వరాను గ్రహామువలన మాటకుమాట – చేతకు చేత – చేయగల నేర్పున్నది.

మత్స్య :— నీ వీనగరప్రవేశ మొనర్చు దీక్షయున్నచో యీ మత్స్యవల్లభునితో యుద్ధమొనర్చి – వాడు సమసినవెనుక నీ యిచ్చ వచ్చినచోటికి నేగుము – క్రియాశూన్యముగ – వ్యర్థోక్తులతో కాల మును వెలిబుచ్చుట వీరోచితముగాదు!

ఆంజ :—సీ. ఎఱుగవు కుఱ్ఱడా యీ కోతి విఖ్యాతి
మామూలు దనుకొంటివేమొగాని!

మత్స్య :— ఎఱుగకుందునె నేను యీ రీతికోతుల
ముంజికాయలవోలె నంజినాను!

ఆంజ :— జాలిని విడనాడి జంపలేనోయబ్బ!
నాతోడ నీకేల ఘాతలాడ!

మత్స్య :— చాలులే నీ మాట శక్తిహీనపుబాట
నగుబాటు విన్నచో యగును నాకు

ఆంజ :—గీ. ఎవరి ముద్దులాడవొ గాని యీ విధాన
నేడు నన్నెదిరింపగా గూడినావు !

మత్స్య :— ఎచట పుట్టిన కోతివో యిటుల నిచట
మత్స్యవల్లభు చేతిలో మరణమయ్యె !

ఆంజ :—నిన్ను పేక్షింపదగదు – యిదే రమ్ము – నీ దుండగములు సహింపరానివి – నీ దుడుకుతనంపుమాటలు క్షమార్హములు కావు – బాలుండవని యుపేక్షించినకొలది భండారములను బయట పెట్టుచున్నావు – ఓరీ మత్స్యవల్లభా ! నీ ప్రాణములపై ఆశ నీకు లేదేని వెనువెంటనే రణరంగమున కుద్యుక్తుండవుకమ్ము.

మత్స్య :—వ్యర్థవచనములతో పనిలేదు – రమ్ము.

(ఇరువురు పోరాడుచుందురు.)

(మరికొంతసేపటికి మత్స్యగంధి —పద్యమును చదువుచు
నారదుడు ప్రవేశము.)

నార :—గీ. ఆగుమాగుము వీరుడా ఆంజనేయ !
యితడు నీ పుత్రుడేయంచు నెఱుగవయ్య
కన్నకొడుకుల నీ రీతి కదనమునకు
తల్లడిల్లగ జేయు నా తండ్రి వేమ !

(ఇరువురును విస్తుపోయెదరు)

మత్స్యగంధి :—మనోహరా ! నమస్కారములు ! మీ పునర్దర్శనభాగ్యమున ధన్యురాలనైనాను.

ఆంజ :—ఇదంతయు రాక్షసమాయకాని వేరొండుకాదు – పుట్టుబ్రహ్మచారినైన నాకేమి – భార్యయేమి – ఇదంతయు సర్వాబద్ధము !

నారద :—ఆంజనేయా! నీవు పొరపడుచున్నావు. కొన్నాళ్ళ క్రిందట లంకాదహనమైన వెనుక సీతాసాధ్విని చూచి తిరోగమించు నప్పుడు - వారధిని దాటునప్పుడు - నీవు చెమట నూర్చినావు - ఆ చెమటను యీ మత్స్యగంధి మింగి గర్భముధరించి యీ మత్స్యవల్లభుని గనిదది. ఇందతిశయోక్తి లేదు! యీ మత్స్యవల్లభుడు నిజముగా నీ ముద్దుబిడ్డ! (మత్స్యవల్లభుని చూచి) మత్స్యవల్లభా! యెఱుగలేకు న్నావు - యీతడు నీ తండ్రి - మహాబలశాలి - నిరుపమాన రామభక్తుడు - ఆంజనేయుడు! వానికి నమస్కరించి వానికి వలయు సేవలనొనర్చి పితృఋణమును దీర్చుము!

మత్స్య :— తండ్రీ - తెలియక జేసిన మహాపరాధములను క్షమింపవా?

మత్స్యగంధి :—జీవితేశా! మన ముద్దుబిడ్డను - ఆశీర్వదింపుడు.

నారద :—ఆంజనేయా! సందియమేల!

గీ. అచ్చుగుద్దినయట్టు లున్నాడు వీడు
మరొక ఆంజనేయుండను మాడ్కిమీర!
గర్వపడవోయి మారుతీ! కన్నకొడుకు
నిన్నుమించినవాడయ్యె నేర్పుమీర!

ఆంజ :—కుమారా! రమ్ము.

(మత్స్యవల్లభుని మారుతి కౌగలించుకొనును.)

మత్స్యగంధి :—కుమారా! తండ్రిగారికి గౌరవమర్యాదలను చేయుము - నేనిదేపోయి వచ్చెదను - శలవు

(మత్స్యగంధి నిష్క్రమణ)

నారద :—మత్స్యవల్లభా! నీ తండ్రి ఆంజనేయుడు రామాన్వే షణచేయుచు వచ్చినాడు. మైరావణుని మాయలచిక్కిన రామమూర్తి

జాడలను నీ తండ్రి కెఱింగించి – ఆ రాకొమరుల బంధవిముక్తికై పాటుపడుము. యీ జన్మలో యీ తండ్రిని మెప్పించుటకన్న నీకు కర్తవ్యమేమున్నదోయీ.

మత్స్య :—చిత్తము.

నార :—ఆంజనేయా ! నే పోయి వచ్చెదను ! జాగురూకుడవై రామకార్యనిర్వహణము చేయుము – విజయమునుబొందెదవుగాక.

(నిష్క్రమణ)

△

•

# మైరావణ

## 8

పురబాహ్య ప్రదేశము.

ప్రవేశము—ఆంజనేయుడు.

ఆంజ :—బాదరాయణసంబంధ మేర్పడినది - నారదమహాని కూడ యీ సంబంధమునే విశదీకరించినాడు పాపము - మత్స్యవల్లభుడు నా కొఱకై పలుబాధల నందుచున్నాడు. పిత్ర్యాణముదీర్ప ప్రభుభక్తినికూడ లెక్కచేయుటలేదు - రామాన్వేషణభారమును కూడా తనతలపై వేసికొన్నాడు - నిష్కల్మషహృదయమును వెలిబుచ్చుచున్నాడు - అదుగో చిరునవ్వులు చిందులాడు చిట్టిమోముతో నా బిడ్డడు వచ్చుచున్నాడు.

(ప్రవేశము—మత్స్యవల్లభుడు)

మత్స్య :—తండ్రీ - నమస్కారములు.

ఆంజ :—బిడ్డా - కార్యమెంతవఱకుమ గట్టెక్కినది ?

మత్స్య :—తండ్రీ - విజయమేగాని పరాజయముండునా ?

ఆంజ :—నాయనా ! మన రామలక్ష్మణులను కన్నులారా చూచితివా ?

మత్స్య :—తండ్రీ !

ఉ. చూచితి రాఘవేంద్రులను శోభనమూర్తుల శోకతప్తులన్
గాంచితి వారికష్టముల కాళికఆలయప్రాంగణంబులన్
శోచనమయ్యె నోజనక ! స్రుక్కుచు శోలించు మూల్గుచుండగా
చూచిన నా మనంబునకు చూడని దుఃఖము ప్రాప్తమయ్యెడిన్.

ఆంజ :—ఔరా! మైరావణుడు కాళికాదేవి ఆలయమునందు శ్రీరామలక్ష్మణుల ప్రవేశపెట్టెనన్నమాట!

మత్స్య :—ఔను తండ్రీ.

ఆంజ :—కడపటివార్తలను తెలిసికొన్నావా? మత్స్యవల్లభా!

మత్స్య :—తెలుసుకొన్నాను. (అటుయిటు చూచును)

ఆంజ :—చెప్పుటకు సంశయించెదవేల?

మత్స్య :—సంశయమేమియును లేదు.

ఆంజ :—మైరావణుం డేమనుచున్నాడో గ్రహించితివా?

మత్స్య :—తండ్రీ – మైరావణుడు గుండెలేనివాడు – పట్టిన పట్టును నెగ్గించుకొనుటలో అతనికి అతడేసాటి. శ్రీరామచంద్రుని మహిమమును ఆతడు గుర్తించలేకుండాయున్నాడు – ప్రాణబంధువైన లంకాధీశ్వరుండగు రావణునకును అతని సామ్రాజ్యమునకును ఈ శ్రీరామచంద్రుడు తీరని నష్టము కష్టము కలిగించినాడను దురూహతోడను అపోహతోడను శ్రీరామునకు తగినపరాభవము చేయవలెనని సంకల్పించినాడు. వేయేల – రేపో మాపో ఆ సుకుమారశరీరులను కాళికాదేవికి బలిగా నిడుటకై నిశ్చయించికొన్నాడట!

ఆంజ :—ఎప్పుడు బలియిచ్చుటకు నిర్ణయించినారో యెఱుంగుదువా?

మత్స్య :—పురోహితునిచే ముహూర్తనిర్ణయము కాకపోవుట వలన యీ కార్యక్రమము ఆలశించినదని, అంతఃపురములో గుసగుసలు వినబడినవి.

ఆంజ :—అంతఃపురములోనే వినపడినవా యీ గుసగుసలు?

మత్స్య :—ఔను జనకా! అక్కడనేవిన్నాను!

ఆంజ :—రాజుల రహస్యములు అంతఃపురములోచెప్పుట రాజద్రోహముకాదా!

మత్స్య :—అందుకు తగినకారణము లేకపోలేదు.

ఆంజ :—ఆ కారణము నెరిగింపరానిదా ?

మత్స్య :— తండ్రీ – మైరావణునిభార్య మతంగి.

ఆంజ :—ఔను.

మత్స్య :—ఆ మతంగికి హింసాపథంబు నచ్చదు త్రాగుబోతు తనము – జారత్వము – చోరత్వము – సహింపదు. దేవుడులేడను వాదమును ఆమె వినదు. సదా – విగ్రహపూజలనుచేయుచు పరమేశ్వర ధ్యానముతో కాలమును గడుపుచుండును.

ఆంజ :—బిడ్డా – మంచిసమాచారమును గొని తెచ్చినావు. ఆస్తికవాదము భార్యది – నాస్తికవాదము భర్తది – హింసాపథము ప్రియునిది, అహింసావ్రతము ప్రియురాలిది. విపరీతశక్తు లొకేగృహమున సాగుచున్నవన్నమాట – అంతేకదా !

మత్స్య :—ఔను తండ్రీ.

ఆంజ :—బిడ్డా ! మతంగి ఏ ప్రభువుని ఆరాధించుచున్నదో ఎఱుగుదువా ?

మత్స్య :—ఎఱుగుదును తండ్రీ !

ఆంజ :— ఎవరిని ?

మత్స్య :—శూర్పణఖ ఒకానొకనాడు మతంగికడకువచ్చినదట. అప్పటికి మతంగికి పెండ్లియైనను మైరావణునివర్తన ఆమెకు నచ్చలేదు. తద్వారా అతడన్నచో యేవగింపుకూడా బయలుదేరినది. కాని – భర్తయగుటచేత – విధిలేక కాపురముచేయుచున్నది. ఆ శూర్పణఖ వచ్చి – మతంగితో

గీ. అందమున్నంత నెందుకే సుందరాంగి
రమ్యతరమూర్తియైనట్టి రామమూర్తి
బహుబంధాలలో చిక్కుపడనినాడు
వాని సౌందర్యమునుదెల్ప వశముకాదు !

అనుచు యేవేవోమాటలు చెల్పినది. నాటినుండియు రాము డన్నచో ఆమెకు మితిమీరిన అభిమానము - ప్రేమ - యీ రెండును క్రమేపీ భక్తిగా మారినవి. ఈనాడు ఆమె పూజాగృహములో రామ విగ్రహము కన్పించును. ప్రతినిత్యమూ ఆ విగ్రహమునకు ఆమె పూజించుచుండును.

ఆంజ :—బిడ్డా ! రామునకు విరోధిగదా మైరావణుడు తన భార్య - విరోధివిగ్రహము నారాధించుట సహించినాడా ! ఇది నమ్మ జాలని విషయముసుమా !

మత్స్య :—జనకా ! మీరు అడిగినప్రశ్న మంచిదే - కాని మతంగి మందిరములో ప్రవేశించుటకు యెవరికిని హక్కు లేదు. ఆమె అనుమతిలేనిదే లోనికి రానీయదు. అంతియేకాదు - ఆమె కొకనెచ్చెలి యున్నది. ఆమెతో మతంగి తన కష్టనిష్ఠూరములను చెప్పుకొనుచుం డును. ఆ చెలికత్తెయే నాకీ వివరములను దెలిపినది.

ఆంజ :—ఆ చెలికత్తె పేరేమో !

మత్స్య :—ఆమెపేరు ప్రస్తుతము మాలతి యనుచున్నది. కాని నిజమైనపేరు 'సరమ' ట.

ఆంజ :—సరమ ! (ఆశ్చర్యముతో ఆలోచించి) స ! ర ! మ !

మత్స్య :—మరి మీ కార్యక్రమమును నిర్ణయించినారా ?

ఆంజ :—అదే యూహించుచున్నాను.

మత్స్య :—జనకా ! మీరు తిన్నగా కాళికాలయంబున కేగుడు అక్కడ క్రుంగి కృశించిపోయిన రఘువీరులను దర్శింపుడు. వారిపై మైరావణుడు జల్లిన మత్తుమందు మహాత్తువలన వారింకను మందగా ఢిగానున్నారు. మధ్యమధ్య పరాకుమాటలాడుచున్నారు. వారిలో వారు నవ్వుట - యేడ్చుట మొదలగు పనులను చేయుచున్నారు. వారితో సంప్రదింపుడు. ఇది మీరు ముందర చేయవలసినపని.

ఆంజ :—ఔను బిడ్డా – నీ నిర్ణయము బాగుగనేయున్నది. అందువల్లనేగదా బాలాదపిశుభాషితమ్మనుచున్నారు.

మత్స్య :—మీరు కాళికాలయములోనే బస యొనర్చుకొని యుండకూడదు. తిరుగవచ్చినచో మరొకమారు పోవచ్చును. ఈ నాటితో మీకు పాతాళలంకయొక్క గుట్టు బయటపడగలదు.

ఆంజ :—బిడ్డా – నీవు – మైరావణపతనమునకు తగినపన్నాగములను పన్నుచుండవలెను. మన యిలవేల్పు రాముడు. రామసేనకన్న మనకు మించినది లేదు. మనసారా రామసేవచేసినచో ముందు ముప్పులుండవు. కాబట్టి అచంచలదీక్షతో ఆ మైరావణుడన్న కక్షతో నిర్ణయింపబడిన శిక్షతో మంతనంబులను సల్పుము. త్వరలోనే మరల నిన్ను కలియుదును.

మత్స్య :—తండ్రీ – మీ వచనంబులకు అన్యధా లేదు. రాజపత్నియగు మతంగినికూడా మీరు కలియుట అవసరమైయున్నది. మతంగిని కలియు చతురోపాయము నూహించెదను. మీరుమాత్రము ప్రశాంతముగా విహరించవలెను. ఆవేశము – ఆతురత – బలాధిక్యత – న్యూనత వీనికి తావిచ్చినచో వున్నరంగము చెడిపోగలదు. తుదకు తోకతెగి గాడిదవాలకమయ్యెనన్నట్లు రసాభాసు కాగలదు. మీరు జాగ్రతగా మెలగవలెనని నా కోర్కె.

ఆంజ :—బిడ్డా ! అట్లే జేసెదనులెమ్ము !

మత్స్య :—మరి సెలవు పోయివత్తురా !

ఆంజ :—అటులే.

(నిష్క్రమణ)

△

# మైరావణ

## 9

మైరావణుని రాజమందిరము.

ప్రవేశము—మైరావణుడు - అతని మంత్రి.

మైరా :—మంత్రిపుంగవా ! పురోహితు లేమైనారు ?

మంత్రి :— దేవా ! కబురంపించినాను - వారేదో స్వాంతపని మీద పొరుగూరికి పోయినారట. త్వరలోనే వచ్చెదమన్నారట - నేటిదినమునకూడా కబురంపించినాను.

మైరా :—నా రాచరికము - మీ మంత్రిత్వము అంత ప్రతిభా వంతముగా సాగుచున్నది.

మంత్రి :—మహారాజా ! మీరు కార్యాతురులై ఆవేశపడు చున్నారుగాని యుక్తాయుక్తములకు స్థానమొసంగకున్నారు. ఇది మా దురదృష్టము.

మైరా :—మంత్రిపుంగవా ! అధికారమును చెలాయించు ఆశ కాదు ! లేదా ఆధిక్యుడనని విఱ్ఱవీగుటకాదు. మా కులపెద్ద వ్యాకుల మును తీర్చుటకై వాగ్దానమిడినాను - దానిని దీర్చుటకే యీ తత్తర పాటు !

మంత్రి :—ఔను మహారాజా ! వధ్యశిలయున్నది - వధ్యు లున్నారు - వధించెడివారున్నారు. అంతయు సర్వసంసిద్ధముగనే యున్నది. మన పురోహితులు వచ్చుటతడవుగా సుముహూర్తమును నిర్ణయించి కార్యక్రమమును సాగించవచ్చును.

మైరా :—మంత్రిపుంగవా! మరల నింకొకమారు పండితులకు కబురంపుడు.

మంత్రి :—అరుగో వారే యిటువచ్చుచున్నారు.

(ప్రవేశము—శాస్త్రి అతని శిష్యుడు)

శాస్త్రి :—పాతాళలంకేశ్వరులకు – భుజబలవిభవోన్నతులకు – దిగంతవిశ్రాంతికీర్తి ప్రశస్తులకు – మా మైరావణప్రభువులకు విజయీభవ! దిగ్విజయీభవ!

శిష్యుడు :—తథాస్తు.

మైరా :—పండితోత్తమా! మీ రాకకై స్వాతివాన కెదురు చూచు ముత్తెపుచిప్పలవోలె రెప్పవాల్చక యెదురుచూచుచున్నాము. మీ రాక కడుముదావహమైనది.

మంత్రి :—ఓ విద్వద్వందితా! మీ రాక శుభముహూర్తము నిర్ణయింపవలసియున్నది.

శాస్త్రి :—చిత్తము.

మైరా :—విషయమును విన్నవించుచున్నాను – జాగరూకులై వినుడు.

శాస్త్రి :—మహాప్రసాదము.

మైరా :—రాక్షసవంశనాశనమునే జీవితావధిగా నెంచుకొన్న ఒక నరమాత్రుని – అతని సోదరుని మనతల్లి – మనపాలిటి దేవతయైన కాళికాదేవికి కాన్కనీయ కంకణము కట్టుకొన్నాను. యీ బలికి మంచి పసందైన ముహూర్తమును నిర్ణయింపవలయును, ముహూర్తబలము నకై యీ కార్యమును ఆపివేసినాము. కాన మీరు శాస్త్రచర్చచేసి – మైరావణుని కీర్తికాంతకు ముసిముసి నగవులందిచ్చు ముహూర్తమును నిర్ణయించుడు. ఇది యీ నాడే నా సమక్షమునందే జరుగవలసినపని.

శాస్త్రి :—మంచిది. మీ ఆజ్ఞానుసారముగా అట్లే చేసెదను. కాని మహాప్రభూ ! ఒక్కసందేహముమాత్రమున్నది.

మైరా :—ఏమది ?

శాస్త్రి :—ఏమియులేదు. ఆ నరమాత్రుడు మన గడ్డలో యెన్నడు అడుగిడినాడో తెల్పగలరా ?

మైరా :—మంత్రిపుంగవా ? మొన్నటిరాత్రికదా !

శాస్త్రి :—(పంచాంగము చూచును)

మంత్రి :—ఔను దేవా !

మైరా :—అంతియే !

శాస్త్రి :—మహారాజా ! మీరు చాలాతొందరపడినారు. మొన్నటిరాత్రి ఆ వ్యక్తిని మీ రిక్కడకు ప్రతికూలగడియలలో గొని వచ్చినారు. విజయము మీదని వెఱ్ఱిభ్రమలుపడుచున్నారు. కాని మీ రనుకొన్నదానికిని - జరిగెడిదానికిని కాసంతయైనను సంబంధముండదు పైపెచ్చు ఆ తారాబలము ననుసరించి అపకీర్తి - అపజయము సంభ వించునని చెప్పవలసియున్నది.

మైరా :—మంత్రిపుంగవా ! మన పండితోత్తముల నోటనుండి శుభంబు వెడలుట చాలకష్టముసుమా !

మంత్రి :—వారికేమి - శాస్త్రమునకు వ్యక్తిభేదములేదుగదా! సర్వసమతయుండుటవల్లనే కళలకు ఆధిక్యత కల్గుచున్నది. శాస్త్రిగారిని మనము నిందించిన ఫలితమేమున్నది మహాప్రభూ !

మైరా :—సరియే - వారన్నమాటనే విమర్శింతము ! చేతజిక్కిన రామురాజు యేరీతిగా నన్నెదిరించగలడు ? ఏరీతిగా నా కపకృతిచేయ గలడు ? ఏ రీతిగా నా రాజ్యమునకు కీడు తేగలడు ? యిది అటుంచుడు రాముని పంచప్రాణములు నా యధీనములోనున్నవి. నే ఛీచర్చదో లేకుండినపక్షమున రాము డెక్కడుండెడివాడోగదా ! బలిపడుగుటకు

సిద్ధముగానున్నాడు మైరావణుడు. యింక అడ్డంకు లెవరికి. ఇది కేవలము అబద్ధము. శాస్త్రముపేరిట శాస్త్రిగారు వచించిన దుర్భాష, పండితులకు గర్వాతిరేకము మెండు. రాజునకు జ్యోతిష్యము చెప్పునప్పుడు యిచ్ఛవచ్చినరీతిగా ప్రేలుట యీ విద్వాంసులకు పెద్దరోగము - యీ బెదిరింపుమాటలకు యీ మైరావణుం డదలువాడుకాడు. అయినను యీ పండితుడు - సుముహూర్తమును నిర్ణయింపక వెనుకటి గాథలను వెదకుట - దాని నాధారముగా జేసికొని యిచ్ఛవచ్చినట్లు రాజసమ్ముఖమున ప్రేలుట అప్రస్తుతము - మంత్రిపుంగవా యీ పండితునివాక్యములందు నాకు నమ్మికలేదు. వీరిని పంపివేయుము.

మంత్రి :—పండితోత్తమా ! విన్నారుకదా ! ప్రభువుల ఆజ్ఞ.

శాస్త్రి :—మహాశయులారా ! నా వాక్యములను మీరపార్థముచేసికొన్నారు. వ్యక్తిగతముగా నేను రాజనిందచేసితినని భ్రమపడుచున్నారు. శాస్త్రబలము ననుసరించి చెప్పినమాటలను సరకుచేయకున్నారు. యిది కేవలము నా దురదృష్టము నా వచనములందలి యీ దార్ఢ్యమును ప్రభువులు ముందైనను గ్రహింపకమానరు.

మంత్రి :—ముందువెనుకలసంగతి యిపుడెందెలకయ్యా !

(పురోహితుడు - శిష్యుడు నిష్క్రమణ)

మైరా :—మంత్రిపుంగవా ! ఎవని ఆత్మకు ఏ నాడు శుభవాంఛ జనించునో అదియే దివ్యముహూర్తము. నాకీనాడు మంగళప్రదమైనదని తోచినది. అందువలన నేటిదినమునందే ఆ కుటిలిని కాళికి కానుకనిచ్చెదను.

మంత్రి :— మీ యిష్టము మహాప్రభూ !

మైరా :—మంత్రిపుంగవా ! యీ నరులను కాళికి బలినొసంగుటకు ముందు వారలను అలంకరించి వాహనములపై కూర్చుండజేసి తూర్యనాదములతో నూరేగించవలయును. ఆ వూరేగింపుతో ప్రతి

రాక్షసుడును తనకు పక్కలో బల్లెమైన యీ రాముడు పాతాళకాళికి బలియగుచున్నాడని - రాక్షసకక్షకు తగినశిక్ష పక్షపాతములేకుండా కాళికేశ్వరి యొసంగినదని - తెలియగలదు. వెంటనే నేటియుత్సవము నందు పురజనులు పాల్గొనవలెనని వీధివీధికిని దండోరా వేయించుము. రామునకు మంగళహారతి నీయనెంచు విద్రోహులున్నారేమో - వెదకి పట్టించుము. వారు గూఢచారులై వానరులకు - తాజావార్తలను అందిచ్చుచున్నారేమో ! ఎక్కడనైనను మారువేషములతో తిరుగు చున్న కపీశ్వరులను నిర్దాక్షిణ్యము వధించుము. రాయబారినని వచ్చి లంకనంతకును అగ్గి నంటించిన దొంగకోతులు చాలావున్నవట.

మంత్రి :—అతిజాగ్రత్తతో తమ కార్యక్రమమును ముగించు టకు యత్నించెదను. శలవా - దేవా !

మైరా :—మంచిది - నా సలహాలను జ్ఞప్తియందుంచుకొని - సమయోచితపరిజ్ఞానముతో రాక్షసజీవినినిల్పు బాధ్యత మీ మీద యున్నది.

మంత్రి :—చిత్తము.

మైరా :—నేటి కీకొలువు చాలింతము.

(నిష్క్రమణ)

# మైరావణ

## 10

రా ణి వా స ము.

(మతంగి సుమమాలలతో ప్రవేశము)

గేయము.

మతంగి :— పూజింతునా! నేను పుణ్యామూర్తిని ఘనుని
పూర్వజన్మముఫలము పొందుచుంటిపెముగని !
విజయలక్ష్మికి విభుడు! విశ్వసౌందర్యుండు
వినుత సౌశీలుండు మహితగుణమాన్యుండు ! ॥పూజి॥
అందాలగని యితని సాన్నిధ్యముంగని
సుందరాంగియె సీత కడుధన్యురాలుగద! ॥పూజి॥
అతనిసేవయె సుఖము! అతని నామమెఘనము
అతనిరూపమె జ్యోతి! అతనివాక్కే శాంతి ॥పూజి॥

(ప్రవేశము—సరమ - పూజాద్రవ్యములతో)

గేయము.

విరజాజిపూలు తేవె
మనవీరుని మెడనుంచవే!
బొండుమల్లియలను కలపి
నిండుగా గులాబి నిలపి
సన్నజాజి విరుల మెలమి

మాలగ్రుచ్చవే ! పూల
మాలగ్రుచ్చవే !

సరమ :—మహారాణీ ! మీరు అంతగా మురియుచున్నారు ! నిజము నెఱుంగకున్నారు.

మత :—అదేమి చెలీ !

సర :—ఏమీ లేదు మహారాణీ ! ఇంతగా స్తుతించుచున్న యీ దేవుడు ఈ నాడు మన పాతాళకాళికి బలియగుచున్నాడు.

మత :—చెలీ – పరిహాసవాక్యములా !

సర :—పరిహాసములుకావు మహారాణీ !

(లోపల దండోరా వినపడును)

మత :—ఆ దండోరాయేమి ?

సర :—అల్లదే ప్రకటన. చెవియొగ్గి విన్నచో మీకే తెలియగలదు.

మత :—(వినును)

(తెరలో వినిపించు దండోరా)

"యియాల రామలోరిని – లచ్చన్నని మనూరి కాళికోమ్మ వారికి యేటయేత్తారు కాబట్టి అందరూ రాయిండో హోయ్"

మత :—చెలీ ! ఎంతటి దుర్దినమే – యీనాడే మన రాముడు సుగుణాభిరాముడు కాళికి కాన్కయగుటు !

సర :—అవును మహారాణీ !

మత :—ఎందులకో యీ రామవధ !

సర :—దేవీ ! యిది ప్రభువులవారి ఆజ్ఞ ! దానికి తిరుగు లేదు!

మత :—చెలియా ! రామలక్ష్మణులు పాతాళలంకకు చేసిన మహాపరాధ మేదీ లేదే? అమాయక రాకొమారుల బలిగొనుటకు ఆ కాళి కెట్లు నూరూరెనో గదా !

సర :—దేవీ ఎవరో వచ్చుచున్నారు! మహాప్రభువులవలె నున్నారు. మీరీ ఆటలు పాటలు - యీ రామస్తుతిని కట్టిపెట్టనిచో శ్రీవారి ఆగ్రహామునకు గురియగుదురు.

మత :—చెలీ! యీ మాలలను - యీ విగ్రహాములను తీసికొనిపొమ్ము.

(సరమ మాలతోడను - విగ్రహాములతోడను నిష్క్రమించును)

(అంతలో మైరావణుని ప్రవేశము)

మైరా :—దేవీ! మతంగమహారాణీ!

మత :—జీవితేశా!

మైరా :—ప్రేయసీ! నీకొక శుభవర్తమానమును దెలుప వచ్చినాడను.

మత :—మంచిదేగదా!

మైరా :— రాక్షసజాతికి గర్భశత్రువగు రాముఁడు - అతనిసోదరుడు లక్ష్మణుడు. మా కులపెద్దయైన రావణుని యెన్నిచిక్కులు పెట్టినారో యెఱుగుదువుగదా! అంతటి బుద్ధిశాలి నేడు నా చేతిలో జిక్కినాడు. ఆ దురాత్ములను మన కాళికి బలిసీయనెంచినాడను. త్వరలోనే సుముహూర్త మాసన్నమగుచున్నది. మన అధ్యక్షతను యీ బలిచర్య సఫలీకృతము కావలెను కావున నీవు వెంటనే సింగారించుకొని బయలుదేరవలెను.

మత :—ప్రాణేశ్వరా! నన్ను క్షమింపుడు! నాకీనాడు శిరోబాధ మెండుగానున్నది - పలుకుటకైనను పలుకరించుటకైనను మనసొప్పుటలేదు. నన్ను మన్నింపుడు.

మైరా :—ప్రేమధనమా! నా విజయోత్సాహాము నీకు ముదావహాముకాదా!

మత :—క్షమించుడు మహారాజా!

మైరా :—అటులైన నిన్ను నిర్బంధించను ! నీ యిష్టానుసారముగనే చరింపుము !

(మైరావణుని నిష్క్రమణ)

గేయము,

మతం :— రాముడు బలియగునా కాళికి
రాముడు రుచియగునా ! ॥రాము॥
నిరపరాధి మా పాతాళములో
నరకబాధలకు గురియైపోవునా ! ।రాము।
ఆ సౌందర్యము అంతరించునా
ఆ భుజబలమే అరుదై పోవునా ? ॥రాము॥
కాంచెదనా నేను రాముని
ఖడ్గధారలకు కాన్కయౌనాడు

(ప్రవేశము—నారదుడు సంగీతధ్యానములతో)

గేయము.

నార :— శీలము భూషణము – జాతికి
శీలము ఆధారంబు ॥శీల॥
పతియేగాని మతియే లేని
అతనికి గౌరవమనగా శూన్యము ॥శీ॥
హింసాత్ముడౌ తన విభునైనను
హితవుమీర జూడదురా పత్ని ॥శీ॥
(అంతలో చెలికత్తె సరమ ప్రవేశించును)

అందరు :—నారదమునీంద్రా నమస్కారములు.

నార :—దీర్ఘసుమంగళీభవ ! మతంగీ ! నీ వట్లు నిరుత్సాహముగ కన్పడుచున్నావేమమ్మా !

మత :—ఏమందును నారదమునీంద్రా ! ఏమని చెప్పమందువు.

నార :—ఏమి చెప్పెదవో ! నా కేట్లు తెలియును ! అవును కాని మతంగీ యీ నాడు మీ పాతాళలంకలో యింతకోలాహలముగా నున్నదే ! కారణంబు తెలియవచ్చునా ?

సర :—రామలక్ష్మణులను - యీ నాడు మైరావణభూపతులు పాతాళకాళికి బలియిచ్చుచున్నారు. అదియే యీ నాటి విశేషము. ఈ ఉపన్యాసములు ! సమావేశములు - ఆవేశములు - ఆ రామవధకే రాక్షసజాతిని నిర్మూలించువాడని - రక్కసస్రామ్రాజ్యములను హరించువాడని—రాముని నేడుకాళికి కానుకయిడుచున్నారు—నారదమునీంద్రా

నార :—(చెవులు మూసికొని) రామ ! రామ ! నిజమేనా మతంగీ !

మత :—(అవమానపడి - నిజమని తలయూపును)

నార :—అన్నన్నా ! యెంతటిదౌర్జన్యము !

గీ. నిరపరాధుల శిక్షించు నీ విభుండు
నీతినెఱుగడె అపకీర్తి నెంచలేడె !
వలదు వలదని వారింప వలదెనీవు
భర్తచెప్పుడు భార్యయే ప్రాణపదము !

సర :—పాపము ! మా మతంగమహారాజ్ఞి చేయవలసినదంతయు చేసినది - యింకేమిచేయగలదు ? ఇప్పుడు ప్రభువులు విచ్చేసి - రాణిగారిని వధ్యశిలకడకువచ్చి తమ అభీష్టమును నెరవేర్పుమని కోరినారు. ఆమె దాని కంగీకరింపక రామచంద్రునిపైగల అనురాగకారణమున విలపించుచున్నది.

నార :—ఔను - మతంగి - రామభక్తురాలు ! యీ మహాదేవిమందిరములో నెచ్చటగన్నను రామనామమే. అంతటిరామభక్తికి ఆలయంబవైన నీవు రాముని రక్షించుటకు యత్నింపవా ?

మత :—దేవమునీంద్రా! స్త్రీలముగదా! అబలలము — అశక్తులము! మావల్ల యేమికాగలదు.

నార :—మతంగీ — భ్రమపడుచున్నావు. స్త్రీ అపరఆదిశక్తి. ఆ ఆదిశక్తికే ఆగ్రహముకల్గిననాడు అణగించుశక్తియే లేదు. స్త్రీమూర్తి అబలయనుట కేవలము పొరపాటు!

మత :—మునీంద్రా! నా ప్రాణవిభుని ఆజ్ఞలకు అభిమతంబులకు ఎదురీత నీదుట విరుద్ధముగాదా! నాకు వేరుగతులుండునా!

నార :—ధర్మమే — పరమేశ్వరస్వరూపము! జన్మకు సార్థకము ధర్మోద్ధరణము. అడ్డంకుల నెదిర్చి — ధర్మముసాధించు దీక్షకు వ్యక్తులు లెక్కకురారు. భర్తయైనను — తండ్రియైనను — శిక్షార్హులు.

మత :—అంతయు పరమేశ్వరానుగ్రహము!

నార :—మహారాణీ! రాముని రక్షించుటకు నీ వలన సహాయమున్నచో చేసెదనని వాగ్దానమునీయవలయునుసుమా!

మత :—అట్లే మునీంద్రా!

నార :—(వెనకటిపాట పాడుచు) నారదుడు సంతోషముగా నిష్క్రమించును.

(నిష్క్రమణ)

▽

# మైరావణ

## 11

కాళికాలయము.

(రామలక్ష్మణులు బంధీభూతులై ప్రవేశము.)

రామ :—సోదరా ! లక్ష్మణా !

లక్ష్మ :—ఏమి ? అన్నయ్యా !

రామ :—పాపము ! నా మూలమున నీకీ రాకాసిమూకల బాధలు లభ్యమైనవి. కుడిచి కూర్చుండగలేక యీ కొంటమాలిన వన వాసమును కోరుకొన్నావు ! అష్టకష్టములను పడుచున్నావు.

లక్ష్మ :—అగ్రజా ! మీరు బాధపడుచున్నారని నాలో నేను క్లేశపడుచున్నాను. తండ్రితరువాత తండ్రియంతటివాడు – పూజనీయుడుగదా అగ్రజుడు ! అట్టి అగ్రజులైన మీరు యీ కాళికేశ్వరిముంగిట కష్టదశనుండ కాసంతైనను మీకు సాయపడనందుకై నాలో నేను విచారపడుచున్నాను.

రామ :—సోదరా ! ఎంతటివానికైనను అనుభవింపవలసినది అనుభవింపకతీరునా ?

లక్ష్మ :—అవును అన్నయ్యా !

రామ :—ధైర్యమునువహించి శాంతమును పెంచినచో ఎట్టి కష్టములైనను గట్టెక్కగలవు.

లక్ష్మ :—ఎవరో రాక్షసులు యిటు వచ్చుచున్నారు.

(ప్రవేశము—ఆంజనేయుడు.)

ఆంజ :—ఓ దశరథ తనూజులారా! యిలవేల్పులారా! యివే నా నమస్సులు!

లక్ష్మ :—సోదరా! చాలామాయగానున్నది- ఆంజనేయుడా? నిజమే!

ఆంజ :—ఔను లక్ష్మణా! నేనే! మారుతిని! గుర్తించలేవా?

రామ :—లక్ష్మణా! యిది రాక్షసమాయ! త్వరపడకుము!

మ. జడుడా నీవు కపీశువేషమున మా సాన్నిధ్యమున్ జేరగా
కడునూహించి గమించినావె యిటు! నీ కన్నన్ బలాధిక్యులే
పుడమిన్ పుట్టగలేరటంచు మదిలో నూహించినావేమొకో
కడుతేర్తు న్నిను మాయరాక్షసుడ! నీ కర్మంబులే మూడెరా!

ఉ. చెప్పదవా? నిజంబుగతి! చేవగరాముని ఖడ్గధారకున్
తప్పనికాన్కయయ్యెదవ? ధర్మవిరుద్ధపు మాయమార్గముల్
గొప్పగచూపు మీగతులు గోతులపాలని యెంచుకొండు! మీ
ముప్పు నెరుంగలేరకట మోసమె మీ కిడు నాప్రమోదముల్

లక్ష్మ :—ఓరీ దురాత్మకా!

శా. ఔరా గుండెలులేవు నీ కిపుడు మాయావేషముల్దాల్చుచున్
యీ రీతిన్ రఘురామచంద్రునకు నెంతేకీడు చేకూర్తువా
పోరా! నీ పస నేలగూలినది! యీ భూమండలంబందునన్
యీ రాము న్గెలువంగజాలు ఘనుడేడీ? లేడు? మైరావణా!

ఆంజ :—ప్రభువులారా! (నిరుత్సాహముగా) రాఘవులారా! ఇదియేనా మీ బహుమానము! మీ దాసానదాసునకు ఇదియేనా మీ అనుగ్రహము!

రామ :—చాలు నీ టక్కరిమాటలను కట్టిపెట్టుము! ఠక్కరులే విజ్ఞానులనుకొనుట పొరపాటు!

లక్ష్మ :—ఓరీ ! రాక్షసాధమా !

ఉ. న్యాయమునే యెఱుంగక ! అనారతమున్ గత ధర్మమూర్తులై
హేయముగా చరించు మిము ఏమనవచ్చును నిద్రపోవగా
రేయరుదెంచి దొంగయటులీకడకున్ గొనివచ్చినావు ! నీ
ఆయువు నింపినావు ! సరిగా చరియించిన ప్రాణముండునా ?

అంజ :—(దుఃఖముతో) ప్రభూ రామభద్రా ! యిదియేనా నీ దయ !

సీ. చిటికెలో లంకకుచేరి సీతాదేవి
క్షేమవార్తను మీకు చెప్పలేదె !
దాటరాని జలధి దారికడ్డముకాగ !
సేతుబంధనమును జేయలేదె !
మా లక్ష్మణస్వామి మగతతో మూర్ఛిల్ల
సంజీవినిన్ గొన చనగలేదె !
ఆ నాటిరేయి మిమ్మందర రక్షింప
వాలమున్ గూటిగా పట్టలేదె !

గీ. పవననందనుడన్ నేను భక్తిమీర
రామచంద్రుని క్షేమవార్తలను వినగ
శ్రమలపడినాడ రాక్షస శక్తులందు
చిక్కి కీర్తి మీ దరి జేరినాడు
సంశయించితిరా నన్ను ! స్వామీ ! మీరు !
గంపెడాసల వన్నియున్ గంగపాలె !

గీ. ఇది నిజంబుగ ప్రారబ్ధమేయటంచు
నారదుండాడినట్టిది నమ్మవచ్చు !
రామచంద్రుడె నాకు నిరాశచూపె !
ధరణివెందుకు మారుతాత్మజుని బ్రతుకు.

(ప్రవేశము—నారదుడు.)

గేయము.

జగదభిరామా – జానకిరామా!
నిగమాగమ వినుతాసురారు! ॥జగ॥
రణతల భీమము వినుతనామ!
ప్రణుత సుచరితా! సురసంసేవితా! ॥జగ॥

రామ :—నారదమునీంద్రా! దయచేయుడు.

నారి :—రామచంద్రా! పాపము! అవస్థాభేదము! నీ యంత వాని కేకష్టములు తప్పినవికావు.

చ. జగముల నేలవాడవయి సన్నుతినందిన మేటివేల్పవై
నిగమని వేదితుండవగు నీ వపురా! ఖయిదీవిధంబుగా
యగుపడుచుంటివో ప్రభువ! యెంతటిజన్మ మెత్తినన్
జగతిని కర్మకన్న నతిసంస్తవనీయములేదు! లేదికన్.

లక్ష్మ :—ఔను నారదా!

నార :—కాని – రామచంద్రా! (మారుతిపై పుజూచి) యీ భీమబలుండైన మారుతి ఖిన్నుడై యున్నాడేమి?

రామ :—నారదా!... ...(ఆశ్చర్యముతో)

లక్ష్మ :—నారదా! అతడు నిజమైన ఆంజనేయుడో – కాడో అని శంకించితిమి! మా శంక – అతనికి వంతచేకూర్చినది!

నార :—రామచంద్రా! మీ కొఱకై సర్వశ్రమలనుపడిన మారుతికి యిదియా బహుమానము.

ఉ. చేరగరాని లంకకిటుచేరి శ్రమంబుల నొందినట్టి యీ
మారుతి కష్టమెంచుటకు మాటలుచాలవు వాఙ్మయంబులో
కీరితిగొన్న సేవకుని కించతులాలన చేయకుండుటల్
కూరిమికాదు! మారుతికి కొండలు బెండులుగావె చూడగన్.

రామ :—మారుతీ ! రమ్ము - రాక్షసమాయవలన విన్నప
భ్రమించితిమి ! దీని నపార్థము చేసుకొనకుము !

లక్ష్మ :—ఆంజనేయా ! మన్నింపవా ?

నార :—ఆంజనేయుం డటువంటివాడుకాడు.

రామ :—నారదమునీంద్రా ! ప్రస్తుతకర్తవ్యమేమి ?

నార :—మీ నమ్మినబంటు మారుతినే యడుగుడు.

(తెరలో పాట వినపడును.)

గేయము.

రండి - రండహే ! రండి - రండహే !
రండీ మనరాక్షసులకు పండువేగదా
మొండివాని రామునకు ముప్పులేగదా ! ॥రండి॥
దండిమగడు మైరావణు దర్పమేగదా
లెండీ - యికరండీ - యిది ఉత్సవమేనండీ ॥రండి॥
నరరక్తము బలుహాయిగ వుంటదంటారు !
సరదాగా ! త్రాగుదము ! సంతోషముతో ॥రండి॥

ఆంజ :— మహాత్ములారా ! అది రాక్షసకోలాహలము, ఆ దురాత్మకులను నే చించి చెండాడి వచ్చెదను. మీరుమాత్ర మీ గర్భ గుడిలో నుండుడు !

(ఆంజనేయుని నిష్క్రమణ)

నార :—శ్రీరామచంద్రా ! సమయమునకు ఆంజనేయుడు నీకు సాయపడుచున్నాడు - నిజముగా ఆంజనేయునివంటి బంటు అలభ్యముగదా !

(తెరలో యుద్ధధ్వని - హాహాకారములు)

రామ :—పాపము - మారుతి - రక్కసమూకలతో పోరాడు చున్నాడు. నారదా ! యిష్టాగోష్ఠి కిదిసమయముకాదు.

నార :—రామచంద్రా !

(తెరలో మ్రూల్గులు)

(మరికొంతసేపటికి ఆంజనేయుని ప్రవేశము)

మైరావణుడు సామాన్యుడుగాడు. అతని జీవితరహస్యమిది ! అతడు ఒక తుమ్మెదలరాజు బ్రతికియున్నంతవఱకు సజీవుడై యుండు నట. ఆ తుమ్మెదలరాజు ఎచ్చట వశించునది యెవరికిని తెలియదు ! ఆ పని మారుతివలన కావలయును ! మారుతి – సరాసరిగ – మతంగితో ముచ్చటించవలయును ! ఆమె నా కొక వాగ్దానమిచ్చియున్నది– రామరక్షకు తన జీవితమునైన త్యాగముచేసి సాయపడెదనని చెప్పినది (ఆంజనేయునితో) మారుతీ – నీవు మతంగిసహాయమున మైరావణుని జీవితరహస్యము నెఱుగవలయును. తుమ్మెదలరాజుని సంతానస్థలము నెఱుగుము. ఆ తుమ్మెదలరాజునితో యుద్ధమొనర్చి వాని నోడించితివా మైరావణుడు నేలకూలగలడు.

ఆంజ :—నేనిదే పోయెదను – రామకార్యమేగదా – నా జీవితావధి !

నార :—రామచంద్రా ! యింక నే నేగెదను.

రామ :— మీ రేగుడు – కానున్నది అగునుకాని కాక యుండునా !

(నిష్క్రమణ)

# మైరావణ

## 12

రంగము—అంతఃపురము - రాణివాసము.

(ప్రవేశము—సరమ - మతంగి.)

సర :—మహారాణీ! మీరు క్రియాశూన్యముగా కాలమును వెలిబుచ్చుచున్నారు.

మత :—ఇంతకన్న నే నేమి చేయగలను చెలీ!

సర :—ఏమిచేయమని చెప్పమందురు ?

మత :—అటు ప్రాణవిభుడు - యిటు ప్రాణసముడు!

సర :—మహారాణీ - మీరు అపోహపడుచున్నారు. మహారాజు అధర్మపథములంబడి జీవితావధిని చెడగొట్టుకొన్నారు. ఎన్ని జన్మలకైనను ఆయనకు రాక్షసపుట్టుక తప్పదు. అధర్మమును ఆదరించినవారికికూడ అట్టిబాధలే కల్గును.

గేయము.

రాముని - జగదభిరాముని
రక్షణసేయగదే! చెలీ!
పతియని గతియని ఆలసించుచో
పాపాత్ములతనిని బలిచేసెదరే! ॥రామ॥
ఖ్యాతినిగనగా! నీతి నిలపగా!
నాతివైన నీ కోరికదీరగ ॥రాము॥

మత :—ఏమో సరమా! నా మనస్సునందు చెప్పరాని ఆందోళల సాగుచున్నది.

గీ. అటులచూచిన పతిభక్తి అడ్డగించు
యిటుల చూచిన ప్రభుభక్తి యేవగించు
మధ్యమార్గంబునందుంటి - మతి గతించె
చేయుటకురావు - చేతులు ! చెలియ వినవె !

(అంతలో ఆంజనేయుని ప్రవేశము)

సరమ :—పావనీ - నమస్కారములు !

ఆంజ :—(నెవ్వెరపడును)

సర :—(కంగారుపడవద్దని సైగజేయును)

ఆంజ :—(తనలో) విభీషణుని ముద్దుటిల్లాలు రామకార్యనిర్వహణార్థమై యీ రాజమందిరములో నున్నదికదా ! (పైకి) మహారాణీ! యివే వందనములు.

సర .—మహారాణీ ! యీతడు ఆంజనేయుడు ! రామభక్తుడు! మీ దర్శనార్థ మరుదెంచినాడు.

మత :—రామభక్త శిరోమణీ - మీ రాకవలన నా గృహము పావనమైనది.

ఆంజ :—మీ వంటి భక్తురాలి దివ్యసందర్శనమువలన నా జన్మకూడా ధన్యమైనది.

చ. ఇరువురి రామభక్తులను ఏకముచేసిన నారదుండు ఆ
దరణమునందు మేటియెగదా యనుకొంటిని - మీమహాత్ముకుం
సరి యికలేని భక్తికిని స్వామి రఘూత్తముడే ముదంపడెన్
గరితలమానికంబవనుఖ్యాతి లభించె ! మతంగి మానినీ !

సర :—మారుతీ ! అక్కడ రామవధకు సుముహూర్తము సమీపించుచున్నదిగదా ! నీ విటు వచ్చినావే ! రాముడు నిష్కారణముగా రాక్షసులకు బలియగునా ! అధర్మమే జయించునా ? న్యాయమే నశించునా ? పరమాత్మునకే మరణమా !

ఆంజ :—ఏమందును – ఎట్లు విన్నవింతును – మా శ్రీరాముని ప్రాణములు యీ మతంగ మహారాణి చేతులలోనున్నవి !

మత :—అదేమి – ఆంజనేయా ?

సర :—మతంగమహారాణి – రామరక్షకై యే త్యాగమైనను చేయుటకు సిద్ధపడియున్నట్లు ఎప్పుడో నారదమునీంద్రునకే తెలిపినది – ఆమె వాగ్దానమును విడనాడునదికాదు.

ఆంజ :—నిజమేనా ?

మత :—(మౌనము వహించును)

ఆంజ :—నిజమేనా ? మహారాణీ – మైరావణుని జీవితాధారమైన ఆ తుమ్మెదలరాజు ఎచ్చటనున్నాడో – ఏ మూలనున్నాడో శలవిచ్చినచో రాముడు రక్షితుండగును. మైరావణుని పతనమగును – లేనిచో మైరావణ రక్షణ – రామ భక్షణ కాగలదు – కలకాలము మీకు నశింపని అపఖ్యాతి చేకూరును.

మత :—ఆంజనేయా – నీ కిది ధర్మమేనా !

గీ. పతియె గతియందురే – భువి పండితాళి
భర్తలేనట్టి వైధవ్యబాధలందు
ద్రమ్మగమనుచుంటివా నన్ను – మాన్యచరిత !
తనకుమాలిన ధర్మంబు ధరణిగలదె !

గీ. పసుపుకుంకుమ దూరమై వరలునటుల
తాళిబంధంబు తునియలై దనరునటుల
పాడువైధవ్యదశతోడ బాధపడగ
దారి చూపించుచుంటివా ధన్యచరిత !

గీ. ప్రాణవిభునకు మరణంపుబాధ యచట !
ప్రాణసమునకు ఇక్కట్లుబారి ఇచట !

రెండు క్రుంగించె కృశియించుచుండె నన్ను
రహిని పతిబక్తి కేదురయ్యె రామభక్తి!

ఆంజ :—తల్లీ! నీ సంశయము నే నెఱుంగుదును. భర్తను - మోహించినవానిని - మురిపించినవానిని - గృహమేధిని - చేతులారగ మరణమునకు బంపుట మహాత్యాగమే - నిజముగా కష్టమే - మహారాణీ - మైరావణుడు నీ భర్తయైనను అతడుచేయు అవినీతికార్యములకు - అధర్మమార్గములకు లోకమెంతగా శోకించుచున్నదో గ్రహింపుము. అటువంటి అధర్మము - అన్యాయము - అవినీతి అంతరించుటకు నీ వంటి భక్తులుకూడ త్యాగముచేయవలెను.

సర :—ఆంజనేయా! ఒకమాట!

ఆంజ :—ఏమది?

సర :—

గీ. రామచంద్రుడు మనసార రాణిదరికి
వచ్చి వలపిచ్చి మురిపించి వాంఛదీర్చి
కామక్రీడల దేల్చచో — రామరక్ష
చిటికెలోఁగూడు వేయేల — చింతలేల!

ఆంజ :—(తనలో) సరమ మంచిపన్నాగమునే పన్నినది. కాని యిది గొంతెమ్మ కోరెకవలె నున్నది - ఉపాయమున అపాయమును తప్పించుకొనవచ్చును. ప్రస్తుతము సరేయందును. (పైకి) ఆహాఁ యీమెచేసిన మహోపకారమునకు రామునిచేఆబహుమానమిప్పింతును

సర :—మహారాణీ - మీ కోరిక నెరవేరినదిగదా! ప్రాణవిభుడు లేడు - రామవిభుడు మీ దరినుండునుగదా! జీవితరహస్యమును చెప్పెడు.

ఆంజ :—ఔను మహారాణీ - ఆలశించినచో - మీ రామవిభుడు కీడులందును.

మత :—(దుఃఖముతో)మారుతీ-(జడతో)అదుగో ఆ కనుపించు కొండకోనలో మూడవశిఖరమునందున్నాడు - తుమ్మెదలరాజు, ఆతని చేతినున్న అయిదుతుమ్మెదలే మైరావణుని పంచప్రాణములు.

ఆంజ :—తల్లీ! యింతియేనా?

మత :—ఈ ఉంగరములేనిదే అచ్చటివారు నిన్ను లోనికి రానీయరు. దీనిని ధరించితివేని విజయము వెనువెంటనే లభించును.

ఆంజ :—(ఉంగరమును స్వీకరించును) మహాప్రసాదము తల్లీ శలవు.

(ఆంజనేయ నిష్క్రమణ)

మత :—చెలీ - భర్తకు మరణమిచ్చుట మహాపాపముకాదా!

సర :—మహారాణీ - వ్యర్థవిచారములను మనసునందుంచుకొనకుడు - మాయమైరావణునిపంచ మీ మనోవాంఛలు యీడేరలేదుగదా! అతని అర్ధాంగిగానున్నను మీ సౌందర్యము - మీ శీలము మీ సుగుణములు అడవిలోగాచిన వెన్నెలవలె నున్నవి. ప్రపంచశాంతి కొఱకు ప్రజాసౌఖ్యముకొఱకు - ధర్మసంస్థాపనకొఱకు - న్యాయసముద్ధరణకొఱకు - మీ రీత్యాగముచేయుటలో తప్పులేదు. ప్రపంచమే ముక్తకంఠముతో మీ నిరుపమాన సౌశీల్యమును పొగడకలదు.

మత :—ఏమో చెలీ - నా విభుని దర్శనము - రణభూమిలోనేమో!

సర :—మహారాణీ మీరు అజ్ఞానములో నున్నారు - జగదేకవీరుడు - పరమేశ్వర స్వరూపము - రమ్యశీలుడు. శ్రీరామచంద్రుడే మీ బాహుబంధములో యిముడుచున్నాడుగదా! ఇంతకన్న కావలసినదేమున్నది మహారాణీ!

మత :—నిజముగా రాముడు నా దరిని జేరునా?

సర :—తప్పక జేరును తల్లీ - మైరావణుడు మరణించిన మరు క్షణమునందే ఆ అందగాడు మీకు విందిడ రాణీమందిరమును జేర గలడు - ఆంజనేయుడు ఆడితప్పువాడు కాడు.

మత :—సరమా - నా హృదయపీఠికపై ఆ జగదేకమోహనుడు అధివశించునందువా ?

సర :—మహారాణీ !

గేయము.

నోములు పండినవి - దేవీ
పూజలు ఫలపడెను !
రాము రాణివై ఠీవిమీరగా
ఘనతరయశమున గాంతువు ! ॥నోము॥
రేపటి మాపే ! నీ దరిరాడా ?
రతిక్రీడలతో వడి కులికింపడా ॥నోము॥
మహితయశంబున మమతలుదీరగ
మా మహారాణిని - మను పలుకరింతె ॥నోము॥
వన్నెలమీరెడి వస్త్రముదాల్చి
అన్నులమిన్నగ సింగారించి
రామబాహులకు అర్పణకాగా
రావే చెలియా ! లేవే ! లేవే ! ॥నోము॥

(నిష్క్రమణ)

# మైరావణ

## 13

రావణు దర్బారు.

ప్రవేశము—మైరావణుడు – మంత్రి.

మైరా :—మంత్రిపుంగవా! కాళికాలయంబున కేగిన మన వీరు లేమైనారో తెలియకున్నది, సురాపానముచే మత్తులై కార్యక్రమమును మఱచినారుకాబోలు.

మంత్రి :—ఏమో మహారాజా! మన వీరులు నిజముగా అంతటివారలే!

మైరా :—అదుగో! ఎవడో భటుడు ప్రవేశించుచున్నాడు.

(ప్రవేశము—రాజభటుడు.)

మంత్రి :—సేవకా! ఏమంత ఆయాసపడుచున్నావు?

మైరా :—పాపము. సురాపానము జాస్తియైనదికాబోలు! మూఢులు! (పండ్లుపటపటకొఱికి) రాజాజ్ఞను గుర్తించలేని అవివేకులు

భట :—మహారాజా! రక్తాలపరులు కాళికామ్మవారి గుడికాడ సాగుతున్నాయి దేవా! (అనుచు నత్తిగా – ఆయాసముతో మాట్లాడును)

మంత్రి :—ఎందువల్లనురా?

భట :—అదేదో పెద్దకోతి వూప్ – వూప్ అంటూ మనోరితో రండాగొండిగా యుద్ధంసేసింది మహాప్రభూ!

మంత్రి :—మహారాజా! వింతగానున్నదే!

మైరా :—ఓహో! (ఆలోచించి) లంకాదహనముచేసినది ఒక కోతి – రామబంధువులు కోతులే! ఆ కోతియే మైరావణుని సామ్రాజ్యమున మాయోపాయమున ప్రవేశించినదికాబోలు!

(ప్రవేశము—మరొక భటుడు)

భటు :—(నిరుత్సాహముతో) మహారాజా! మనసైన్యము – మన సేనానాయకులు ఆ కోతికి అర్పణమైనారు. ఔనన్న వీరులందరు అస్తమించినారు.

మైరా :—మేఘనాధునితో చెప్పుడు. యీ స్వల్పమాత్రము కోతిని చంపుటకు అతడు చాలును–ఇట్టి ఘనకార్యమా ఏమి? నేను వచ్చుటకు!

భటు :—మహాత్మా. (తలవంచి) అతడు గతిజీవుడైనాడు – వానరునకు బలియైనాడు – ఏమందును మహారాజా!

మైరా :—ఏమీ! మైరావణుని కుడిభుజమై – నిర్వక్రపరాక్రమోపేతుడైన మా మేఘనాధుఁ డస్తమించెనా! ఔరా! ఆ కోతి ఎంతబలశాలియోగదా! మరి భైరవముఖుండేమైనాడు?

భటు :— మహాత్మా! భైరవముఖుడుకూడ మడిసినాడు – పాపము శ్రమపడినాడు!

మైరా :—అయ్యో! భైరవముఖుడుకూడా బలియైనాడా? ఎంతవిపరీతము? ఘటికాసురుడు యీ సమాచారమును వినలేదా?

భటు :— మహారాజా! ఘటికాసురుడు నిరుపమానపరాక్రమము చూపినాడు. విజయమును పొందునేమో యనుకొంటిమి. కాని అతడుకూడ అస్తమించినాడు.

మైరా :—మరి సుచర్మకుండేకథలనువిని వూరకొన్నాడా?

భటు :—లేదు – మహారాజా! ఆతడే ఆఖరివీరుడు. కడపటి యత్నమునుచేసిన యోధుడు – వానరునకు బలియైనాడు.

మైరా :—మంత్రిపుంగవా - కడువిచిత్రముగానున్నది - ఇం దరి రాక్షసులను పొట్టబెట్టుకొన్న ఆ మాయకోతిని నే నిదేపోయి చించి చెండాడెదను - మంత్రీ - యుద్ధమునకు బలియై అసువులను గోల్పోయిన మన సేనానాయకుల దివ్యగాథలను శిలాక్షరములుగ లిఖించి వారి వీరమరణమునకు మన సానుభూతిని తెల్పుము. నే నీనాడేపోయి - ఆ వానరాధముని వధించి వచ్చెదను.

మంత్రి :—చిత్తము మహారాజా! మీరు బహుజాగ్రత్తగా నుండవలెనని నా ఆశ.

మైరా :—మంత్రీ! భ్రమపడుచున్నావా! మైరావణుడు చతురోపాయుడని నమ్ముము - ఆతని భుజశక్తి - సమయోక్తికి ప్రతిశక్తి లేనేలేదని నమ్ముము.

చ. అపజయమన్నదాని నిలయందు నెఱుంగని వీరవర్యునే
అపహాసమిుంచు శూరుడొకడైనను లేడిక మంత్రిపుంగవా
కృపయని యూరకొంటిని ఇకేల నరాధము నేలగూల్చెదన్
అపకృతికైన నే భయమునందను రామునిచేన చూచెదన్.

(నవ్వుచు) చేతగాని పెయ్యవన్నలై - కోతికి జవాబు చెప్పలేని మనవారిని ఏమనవచ్చును?

ఉ. శూరులుగారు నాయకులు సోమరులై బలియైరి కోతికిన్
వీరతచూపు నా యెడల 'పెప్పెపె' యంచనుగాని ముంగిటన్
నేరుపుమీర యుద్ధముల నెగ్గునె వానరమింతయేల! క
న్నారగ నిల్చి గెల్చెదను అప్పులకంతకు ప్రీతి నింపెదన్.

(ఆవేశమున) ఓరీ మర్కటాధమా! మైరావణుని చేజిక్కిన నీ పాట్లూహించుకొమ్ము! ఇంతకావరమా!

శా. రారా మూఢుడ! నీప్రతాపమును శౌర్యంబెంతో చూపింపరా
పరా దొంగవిధాన జేరెదవు నీ కింకేటిధైర్యంబురా
ఆరాటంబులుమానరా అసురసామ్రాజ్యాన నీ ప్రాణముల్
పోరాటానికి కాన్కయౌననుచు సంబోధింతురా! వానరా!

(వీరవేశముతో మైరావణుడు నిష్క్రమణ)

# మైరావణ

## 14

కాళికాళయప్రాంగణ రణరంగము :

(ముందు పీనుగుల పెంట – హాహారవములు)

[ప్రవేశము—రామలక్ష్మణులు – ఆంజనేయుడు]

రాము :—ఆంజనేయా ! మైరావణుని సహచరులు పాపము నిర్దోషులై ప్రాణములను గోల్పోయినారు !

ఆంజ :—అందుల కాశ్చర్యమొందులకు రామచంద్రా ! ఇనుమును జేరిన అగ్నిదేవుడు సమ్మెటప్రేటులను దినలేదా ? అటులనే అధర్మపరులను ఆశ్రయించినవారుకూడా నిష్కారణముగా ప్రాణములను కోల్పోవుచుందురు – దీనికి ఒకరు బాధ్యులగుదురా ! రామచంద్రా !

(తెరలో కోలాహలము)

లక్ష్మ :—దర్పముతో మైరావణుడు యుద్ధసన్నద్ధుడగుచున్నాడుకాబోలు !

రాము :—రానిమ్ము – వాడుకూడ మరణించినగాని మన శ్శాంతిలేదు !

ఆంజ :—రామలక్ష్మణులారా ! మీరు కదనరంగమునకు సిద్ధపడియుండుడు. నేను తొలత వాని నొకవటుకు తెచ్చెదను.

(భయంకర రౌద్రావతారుడై మైరావణుని ప్రవేశము)

[గేయము చదువుచు]

మైరా :—

గేయము.

పొగరడగించెద – భూమిని గూల్చెద
పగలమిగిల్చెద – వానరాధమా!
రారా క్రూరుడ! రారా ధూర్తుడ
మేరమీరితివి నిన్నిక సైపర! ॥పొగ॥
కండకావరమునిండె నీలోన
దండి రావణుని దర్పము నరయవు ॥పొగ॥
బలమున చలమున నిను మడియించెద
యిల నీ కెవ్వరు రక్షయో గనెద ॥పొగ॥
మైరావణుతో పగసాధించుట
మారణమార్గముబడి చెడిపోవుట ॥పొగ॥
ఖడ్గధారలకు గదాహుతులకును
కాన్కచేసెదను రారా వానరా! ॥పొగ॥
తెలియక జేసితి రక్షచేయమని
వలవలలాడిన వదల నిన్నింక ॥పొగ॥
రాముడు గీముడు నాశనమే యిక
రావణుబారికి మీరజాలునా ॥పొగ॥

రాము :—ఓరీ రాక్షసాధమా! ఆగుము! వృధాభాషణముల మానుము!

శా. డచ్చీలేటకి మాటిమాటికిని నీడక్కుల్ వృధాయానురా!
పచ్చీరాని పరాక్రమంబులను మా వద్దన్ ప్రగల్భాలతో
నచ్చేరీతిగ పల్కుచుంటి వవురా! నాశంబు చేకూడుగా
వచ్చే వేళయటంచు నెంచుమిక – నీ ప్రాణంబులన్ దీతురా!

ఉ. మాయలమారి రీతిగను మమ్ము హరించి గమించినావు - నీ
హేయపువర్తనంబదియ యెంతటి శూరతయంచు నెంతువో
రాయల నీతిగాదిది! పరాక్రమశాలికి బాటగాదు! నీ
కాయము నీకు దక్కదిక కాచుకొనుమ్మిక యుద్ధభూమిలో!

మైరావ :—ఓరీ నరాధమా!

ఉ. దొంగవిధాన వాలితల ద్రుంచినవాడవు నీ ప్రతాపమే
కంగున మారు మ్రోగినదిగట్టిగ నీతుల నేర్పుచుంటివా?
చెంగటనున్న దోషముల సిగ్గనుమంతయు లేక నాడెదే!
దొంగకుగాని నేర్పడదు దొంగలచాతురి దొంగరాముడా!

ఉ. కోతులకేగదా మిముల కూర్మిభజించుట చెల్లెనౌర! వి
ఖ్యాతికి దూరమైన మిము గౌరవనీయులుగా తలంచుటల్
నీతికి నింపుమార్గములె! నీ బలమెంతయొ - శీవియెంతయో
నే తెలియంగలేననుచు నెంచితవేమొకొ వెఱ్ఱిరాముడా!

ఆంజ :—ఓరీ మైరావణా! దూషణతిరస్కారములకు రణరంగములో తావులేదు.

శా. చేవల్గల్గిన నిల్చియుద్ధములలో జక్కాడు మా రావణా!
శీవిన్గాంచగ నాసయుండినను నేడీ బాటలన్ వీడుమా
చావో! యేదొ జయంబొ గాంచుచును నీ సంస్తుత్యతన్ బొందుమా
నీవే వీరుడవన్న మాటలను మానేయంగ నూహింపుమా!

మైరా :—అటులైన యుద్ధమునకు రమ్ము.

గీ. రండు రండిక భీషణభండనంబు
సలుపుచున్నాడు యిపుడు రాక్షసవిభుండు!
రాముడేగాని - ఎవడైన - రంగమందు
నిల్చి గెల్చెద - తెలియరీ నేర్పుమీరు.

రాము :—రమ్ము మైరావణా! నీ దర్పము తెలియగలదు!

ఉ. స్త్రీలహరించు నేర్పునను సిగ్గు నెనుంగరు నీతినింపరే
కాలము చేసునైనను, అకారణశూరతజూప నెంతురే
జాలిదలంపరాదికను సత్వర వీరి హరింపగావలెన్
ఏల వృథాశ్రమంబులివి - యీ యసురున్ బరిమార్తు నీయెడన్
(రాముడు - మైరావణుడు పోరాడుదురు)

మైరా :—(నుఱికొంతసేపటికి) బాబుగారి పస బయటపడినది! ఇంతియేనా నీ శూరత.

లక్ష్మ :—నిన్ను విడనాడుదుమా! దురాత్మా.

(రామలక్ష్మణులు మైరావణునితో పోరాడుదురు)

ఆంజ :—(తనలో) ఔరా! మైరావణుని పరాక్రమము విచిత్రముగనున్నది - ఒకమాదిరిగా యీ నీచుడు లొంగువాడుకాడు - ఆ తుమ్మెదలరాయనికడకు మా మత్స్యవల్లభుడుపోయి అచ్చట తుమ్మెదలను చంపినచో - యీ పాటికి యీ మైరావణుడు మృతిజెందియుండును

(లక్ష్మణుడు ఆంజనేయునికడకు వచ్చును.
రాముడు భీకరముగా పోరాడును.)

లక్ష్మ :—మారుతీ - మైరావణుని దర్పము మేరలేనిది - ఎంత శక్తి అతనిలో నున్నది - అలసటయను మాటలేక అతడు యుద్ధములను జేయుటచూడ శోచనీయముగానున్నది.

ఆంజ :—సౌమిత్రీ! అతని జీవితరహస్యమునంతయు నెఱిగి నాను - దానికి పన్నాగమును పన్నినను త్వరలోనే యీతడు నేల గూలగలడు.

లక్ష్మ :—కానిమ్ము - నేనుపోయి రామునకు విశ్రాంతి నిచ్చెదను.

(లక్ష్మణ - మైరావణులు యుద్ధము సేయుచుందురు -
రాముడు ఆంజనేయునికడ వచ్చును.)

ఆంజ :—రామచంద్రా! కడుంగడు అలసినారు.

రాము :—పాపనీ! యీ మైరావణుని వధించుట తేలికగాదు. నా బలమునంతను వీడు శోధించుచున్నాడు.

గీ. అలసిపోతిని నేటికి ఆహవమున
గుట్టు తెలియక వీనితో రట్టుపడుట
తెలివితక్కువగానుండె - నిలిచిచూడ
మారుతీ యింక మనకు యేదారిగలదు ?

ఆంజ :— మహాత్మా - ఇతని బలమంతయు - కొన్నితుమ్మెదలమీద ఆదారపడియున్నది - అడుగో మత్స్యవల్లభుడు ఆనందమూర్తియై యిటువచ్చుచున్నాడు. అతడు తుమ్మెదలను చేతగొని వచ్చుచున్నాడు రామచంద్రా! మీరు నిశ్చింతగా యుద్ధముసేయుడు. మైరావణుడు మడియగలడు.

(రాముడు యుద్ధము సేయుటకు పోవుచు)
(మరికొంత సేపటికి మత్స్యవల్లభుడు తుమ్మెదలరాజు ప్రవేశించును.)

ఆంజ :—కుమారా! జయము గొని తెచ్చితివా ?

మత్స్య :—ఇవిగో తుమ్మెదలు - ఇడుగో తుమ్మెదలరాజు - (అని తుమ్మెదలను చంపును) తండ్రీ! అడుగో మైరావణుడు నేల గూలినాడు!

మైరా :—(నాటిన బాణమును చేబట్టి) అయ్యో - తుమ్మెదలారా! మైరావణునిమాట మఱచినారా?

ఉ. వీరుడు ఆహవస్థలిని వింతగ గూలుట చూచుచుంటిరా
గారవమార గాచుటకు గంతులువైచుచు రారెమీరు! ని
ష్కారణ వైరమూనితిని కానుకమైతిని రామమూర్తికిన్
మారణమందినాడ! అవమానము న్యూనము గూడువేళలన్.

గీ. తనకుమించిన పనిబూని దనరువాడు
వ్యర్థవాగ్దానములనిచ్చి బ్రతుకువాడు
వీరుడనటంచు నిల విఱ్ఱవీగువాడు
జగతి ననుపోలి యెప్పుడో సమసిపోవు!

(కళ్ళు మూయును)

రామ :—ఆంజనేయా! చూచితివా? మాయమైరావణుడు మృతినందినాడు.

ఆంజ :—ఆశ్చర్యమేమి రామచంద్రా!

ఉ. నీతినెఱుంగ క్రీబ్రతుకు నీచులరీతుల చూచినాడ, వి
ఖ్యాతికిదూరమై పరువుగాంచక వ్యర్థపుశూరవర్యులై
గోతులగూలు వీరలకు గొప్పలభించుట వట్టిమాటయా
చేతకుమించు కార్యములజేసిన యీ ఫలమయ్యె నయ్యయో!

లక్ష్మ :—ఆంజనేయా! వీ రెవ్వరు?

ఆంజ :—ఇతడు మత్స్యవల్లభుడు – నా కుమారుడు – మైరావణ సంగ్రామమున అనేకరీతులుగా దోడ్పడినవీరుడు!

లక్ష్మ :—అన్నయ్యా! బ్రహ్మచారినని – మన మారుతి – కుమారుని గనినాడే!

రామ :—ఆ గాథ కడువిచిత్రమైనది లెమ్ము.

ఆంజ :—కుమారా! రాఘవేంద్రులకు అంజలింపుము!

మత్స్య :—రామభద్రా! నమస్కారములు.

రామ :—యీ పాతాళలంకకు నిన్నే ప్రభునిగా చేయనెంచినాను! నీతినిలయముగా శీలవంతుడవై యీ పాతాళసామ్రాజ్యమును పరిపాలింపుము.

లక్ష్మ :—తథాస్తు.

ఆంజ :—రామచంద్రా! యితడు తుమ్మెదలరాజు. మైరావణుని పంచప్రాణములను కాపాడువాడు. యితని సహాయమువల్లనే మైరావణుని తుమ్మెదలు మంటగలిసినవి.

రామ :—ఆంజనేయా! నేటితో మన కష్టములు గట్టెక్కినవి. మన మత్స్యవల్లభునికి పట్టముగట్టి యిక మనము రావణసంగ్రామమునకు పోవలసియున్నది – ఇక లెమ్ము.

ఆంజ :—చిత్తము.

(నిష్క్రమణ)

# మైరావణ

## 15

పా తా ళ లం కా పు రి.

(ప్రవేశము—రామలక్ష్మణులు – మారుతి – మత్స్యవల్లభుడు)

రామ :—మారుతీ మనపని నెఱవేరినది. దురంతముల కంతు లేక సాధుసజ్జనసంతాపకారియగు మైరావణుడు మడిసినాడు – మన కింక అడ్డంకులు లేవుగదా.

లక్ష్మ :—తన కుమారుడగు మత్స్యవల్లభుడు పాతాళలంకేశ్వరు డై నందులకును తన ఆధ్వర్యమున మైరావణపతనము సంప్రాప్తమైనం దుకును ఆనందించవలసినసమయమున ఆంజనేయుడు నిరుత్సాహియై కూర్చున్నాడు కారణమేమియో తెలియకున్నది అన్నయ్యా!

రామ :—పవననందనా! మనోక్లేశమునకు హేతువేదో యెఱిగింపవా?

ఉ. కూలెను మాయరాక్షసుడు – కూలె నధర్మము శాంతినింపగా
యేలికయయ్యె నీ సుతుడు యీమహికిన్ మురిపెంపు వార్తలన్
యేల వినంగనోప విదియేమి విచిత్రము ఆంజనేయుడా!
చాలు! విచారకారణము సత్వర మా కెఱిగింపు నెంచుమా!

(తెరలో సంగీతము)

గేయము.

మాయాతీతుడవగు నిన్ను తెలియ
మానవులకు తరమా దేవా? ॥మా॥

దీనపోషణా దైత్యనాశనా !
దివిజతోషణా దేదీప్యమాన ! ॥మా॥
ఆశ్రితావనా అఘవినాశనా
ఆదరించు నీ వాడ నోరేడ ॥మా॥

(ప్రవేశము—నారదమునీంద్రుడు)

అందరు :— దేవమునీంద్రా ! నారదా ! దయచేయుడు.

నార :— రామచంద్రా ! మైరావణుడు పాపఫలిత మనుభవించినాడా ?

ఉ. పాపము పుణ్యమున్ గనక భ్రాంతియెలర్పగ గర్వపోతుగా
భూపతిగా యహంకృతుల ప్రొద్దునుపుచ్చెడి వారి జీవముల్
యీ పగిదిన్ నశించుగద ! యేటికి వ్యర్థవివాదమన్న దే
తోపని మాయరావణుని దోర్బలమంతయు నేలపాలయెన్.

చ. సతులకు మానభంగమును సాధులకున్ పరితాపవహ్నియున్
జతపడజేయు నీ యసురజాతికి నేర్పితివబ్బ పాశమున్
యితరము నే యెఱుంగక మహీతలమందున బాధలీయకే
బ్రతుకుట రాక్షసాధముల బాటగజేతువె రామచంద్రుడా !
(మారుతిని చూచి) రామచంద్రా !

గీ. అష్టకష్టాలపడిన యీ ఆర్యనుతుడు
ఆంజనేయుడు ఉత్సాహ మందనటుల
చింతపడుచుండెనాయేమి ? యింతవంత
యెందుకోగాని ! శ్రీరామ ! యెఱుగమయ్య !

లక్ష్మ :— మారుతీ నీ విచారకారణము తెలుపవా ?

ఉ. తీరని బ్రహ్మచర్యమును తీసుపనెంచితె మారుతాత్మజా !
కారణమున్ వచింప కిటు గాసిలనేటికి రామమూర్తితో

చేరి వచింపరాని యదిసిగ్గును పెంచెడి వింత వార్తలన్
తీరికగా రఘూత్తముని దివ్యునితో మెఱిగించు పావనీ!

నార :—(ఆలోచించి) రామచంద్రా! ఆంజనేయుని విచార కారణము నే నెరుంగుదును!

రామ :— ఏమది — నారదా!

నార :—

ఉ. రావణు ముద్దుభార్యకు వరంబిడినాడట ముందుచూడ కా
దేవిని రామమూర్తికిక దివ్యవధూటిగ జేతునంచు నీ
సేవకుడైన పావని వచించిన సిమ్మట నా మతంగియే
రావణు ప్రాణపోకడకురామ! ఉపాయముచూపె నప్పుడే!

గీ. అపుడు మాతంగి యీ గుట్టు నధికప్రేమ
చెప్పకుండిన మీకెన్ని చేటులగునో!
ఆంజనేయుని చింతకు అదియసుమ్ము
కారణంబయ్యె శ్రీరామ! గణ్యనామ!

రామ :—(విచారమున) మారుతీ — ఎంతటి విచిత్రవాగ్దాన మిడినావోయీ!

ఉ. రాముడు స్త్రీల నొల్లడని రాగములేదని యేకపత్నితో
నీమముతోడనుండెనని నీ వెఱుగంగనిదా! యిదేమొకో!
కామముమీర నా యసురకామినితోడ రమింపనెంచుటల్
యేమనుకొంటివో యెఱుగ యీగతి మారుతి సేయన్యాయమా!

ఆంజ :—మహాప్రభూ! మీ కపర్తి దెచ్చుట నా మతము గాదు మీ ప్రాణరక్షణదీక్షతో అంతపని చేసినాను.

ఉ. ఆ పనిచేయకుండునెడ ఆశకు తావనుమాటలేదు నా
కేపగిదిన్ వచించుటకు యేమియుదోచని చెడ్డకాలమై
చూపెశనిని గ్రహంబటుల చోద్యపుదాశిని, దానికోసమై!
యాపటినుండి బాధపడు మారుతి రాముని సేమమెంచుచున్.

రామ :—ఆంజనేయా — నీవీ విషయములో విజ్ఞానము నుప యోగింపలేనైతివి — ఒకమాట — ఒకబాణము — ఒకపత్ని యీ రామా

వతారమునందే సాగును - యీ యవతారమందు పరస్త్రీ సంగమము లభ్యముకానిది - అట్టితరి మతంగికి నీ వొసంగిన వాగ్దానము చేతకు మించినది. పాపము - రామునితో రమించు నాసతో ప్రాణవిభుని మర ణమునకైనను సాహసించిన మతంగి దుస్థితికి నా మనస్సెంతో ఆందో ళన చెందుచున్నది - మతంగికి ఆశాభంగము - నీకు నిరుత్సాహము! ఇవి రెండును తప్పనియట్లున్నవి - నే నింతకన్న నెమియుచేయలేను.

నార :— ఆంజనేయా! పాపము - రామునకై పడరానిపాట్లను బడితివి - రాముడు నీ మాట దాటునాయని యువ్విళ్ళూర్చితివి. గంపె డాసతో - ఆ రక్కసకాంతకు వాగ్దానమిచ్చినావు - రాముడు నీ కోరి కను దీర్పకున్నాడు - పాపమా మతంగిగతి యేమి కావలెనోయీ!

ఉ. గుండెలు లేక మాటలను గుప్పితివా! యసురాంగనామణిన్
దండిగ రాముభార్యయటు తప్పక జేసెదనంచు బల్కితా!
మెండు ముదాన ప్రాణవిభు మేనిరహస్యము విప్పిచెప్పినా
చేడి మతంగిప్రశ్నలకు చెప్పెదవా - ప్రతికూలవాక్యముల్.

చ. మగనిని గోలుపోయిన యమాయకురాలు కుపారుమీర! నీ
వగుపడగానె రామునకు భార్యగజేతునె నన్ను పిల్తువే
అగుపడడేడి రాముడని ఆశలుమీర వచించినాడు! ఏ
మగునని యెంచుచుంటివి-మహాపకృతుల్ తగవోయి మారుతీ!

ఆంజ :— నారదా! నన్ను మరింత క్రుంగజేయుట నీకు ధర్మమేనా?

ఉ. రాముని ప్రాణమేపగిది రాక్షసబారికి చిక్కనంచు - నే
నేమని చెప్పువాడ - తపియించితి! రక్షణ దీక్షమీరగా
నీమము నే తలంచక - సునిశ్చితచిత్తుడనై వచించితిన్
భామినిచెంత నేను నగుబాటుల పాలగుచుంటి నయ్యయో!

నార :— రామభక్తశిరోమణీ - పావనీ! నీ ప్రభుదీక్ష ఆదర్శ ప్రాయమైనది - దీక్షాపరతంత్రుడవైన నీవు వాగ్దానమిడుటలో తప్పు లేదు - ఏకపత్నీవ్రతుడైన రాముడు నీ వాగ్దానము నంగీరించకపోవు

టయు తప్పకాదు – యుక్తియుక్తముగా నీ రాజకీయములనుండి తప్పించుకొనుట సముచితమైనపని – ఏమందువు.

ఆంజ :—నీవే సర్వసమర్థుండవు – పాలముంచినను – నీటముంచినను నీదేభారము !

నార :—నా కొక ఉపాయము తట్టుచున్నది. ఇదియే నీ అపాయమునకు రక్షణోపాయము !

ఆంజ :—చెప్పుము నారదమునీంద్రా !

నార :—ఆంజనేయా ! యీ ఉపాయము శ్రీరామచంద్రునకు ఇష్టపడదేమో !

రామ :—నారదా ! నా ఏకపత్నీవ్రతమునకు భంగమురానిదైయున్న ఎట్టిఉపాయముతోనైనను మారుతి కపాయము గల్గనీయను.

నార :—ధన్యోస్మి ! ధన్యోస్మి !

ఆంజ :—నారదా – చెప్పవా నీ ఉపాయము !

నార :—ఆంజనేయా ! మతంగికడకేగి – రాముడు నీతో రమించుటకై వచ్చుచున్నాడని దెల్పుము.

ఆంజ :—నారదా ! పరిహాసమా ! రాని రాముడు వచ్చుచున్నాడని అనృతమాడమందువా ?

నార :—తన వ్రతభంగముకానినాడు రాముడు మతంగిమందిరమునకు వచ్చుటకు అభ్యంతరములేదుగదా ! ఏమి రామచంద్రా !

రామ :—ఔను – నా వ్రతభంగము కానినాడు మతంగిమందిరమునకు వచ్చుటకు రవ్వంతయు అభ్యంతరములేదు.

ఆంజ :—సరే – బాగున్నది – అట్లే మతంగితో చెప్పెదను – పిమ్మట ?

నార :—ఆమెతో యిట్లనుము.

గీ. ప్రథమ సంగమమందు నీ ప్రాణవిభుడు
నిన్ను గూడెడివేళల నియతిగలదు !

ఎట్టి యపశకునంబైన యుట్టిపడిన
శాశ్వతంబుగ నిస్గాడజాల డతడు !

అని చెప్పుము !

ఆంజ :—బాగుగనేయున్నది - అపశకునము కల్గునో ! కల్గదో ! యీ జ్యోతిషము చెప్పగలవారెవరు నారదా !

నార :—ప్రపంచజ్ఞానములేనిదే బ్రతుకుట కష్టతరమేయగును మారుతీ !

ఆంజ :—నన్ను వేసారింపక విషయమును విపులపఱచుము నారదా !

నార :—ఆంజనేయా ! బలశాలియైన నీ కుమారుడు తుమ్మెదల రాయనిని బానిసగా చేసుకొన్నాడుగదా ! ఆతనిని పిలువనంపుము !

ఆంజ :—అట్లే జేసెదను ! అతనివలన కాదగిన కార్యమేమి గలదు నారదా ?

నార :—మతంగి శయనాగారములోని మంచపుకోళ్ళలోదూరి వాటిని దొలుచమని ఆ తుమ్మెదలరేనికి చెప్పుము. మంచము పైకి మామూలుగా నుండునేగాని లోపలిరహస్యము పాపము రాణికి తెలియదుగదా ! అపశకునము జరుగరాదనుసంగతి ముందే యెరుగును గదా ! శ్రీరామచంద్రుడు సరాసరి మంచముకడ కేగును - మతంగి పైపే చూచుచుండును - మతంగి కేళీలోలత్వముననుండి నుత్సహించును ! రాముడు కూర్చుండిన మంచము టపీలుమని విఱుగును - ఆ అపశకునముతో విరక్తిచెందినట్లు రాముడు మతంగి మందిరమును విడనాడును - తన ప్రారబ్ధమని మతంగి తరువాత విచారించనిమ్ము - ఎవరిగోల వారిదేగదా !

ఆంజ :—నిజముగా గొప్పవాడవు నారదమునీంద్రా ! నీ వూహాలు అతీతమైనవి—

గీ. తూట్లుపడినట్టి గుండెకు తోషమిడెడు
మాన్యమూర్తివి నీవోయి ! ధన్యచరిత !
ఎన్నిజన్మాలకైనను నీ ఋణంబు
తీర్చుకోలేను నారదా ! దివిజ వినుత !

శ్రీరామచంద్రా ! తమకీకార్యక్రమ మంగీకారమేగదా !

శ్రీరా :—ఔను – అంగీకారమే – ఇందు వ్రతభంగము రవ్వంతయు లేదుగదా !

ఆంజ :—కుమారా ! నీవు వెంటనే తుమ్మెదల రేనికి ఆ పని పురమాయింపుము. వెంటనేయేగుము.

(నిష్క్రమణ)

△

# మైరావణ

## 16

రాణివాసము - శయ్యాగృహము అలంకారపూరితము.

ప్రవేశ—మతంగి - సరమ.

మతం :— చెలియా ! రామచంద్రుడు వచ్చుచున్నాడేమో చూచితివా ?

సర :—దేవీ - యింకను వచ్చుజాడలు లేవమ్మా - తప్పక వచ్చును – సంశయింపకుము-నీ మనోభీష్టము క్షణకాలములో నెరవేరునమ్మా ! మహారాణీ ! రామరాణీవిగా కులుకగలవులే !

మతం :—

గేయము.

వస్తాడే నా ప్రియుడు ! వస్తాడే నా విభుడు !
ఇస్తాడే తన వలపు ! తెస్తాడే తన ప్రేమ ! ॥వస్తా॥
దశరథరాముడు వస్తాడే
తనుజితమారుడు వస్తాడే !
రాఘవరాముడు వస్తాడే
రామారాణిగా జేస్తాడే ॥వస్తా॥
వలపుపన్నీట జలకమాడించి
కులుచు పలుకులను వూయలూగించి
మనసు మనసుతో నైక్యముజేసి
తనివిగి కౌగిలి నిస్తాడే ॥వస్తా॥

వచ్చేవేళ వచ్చినది
నచ్చే వలపది హెచ్చినది
నా మనసిక సమ్మదమందినది
రామునిరాక స్థిరపడినది ॥నస్త్రా॥

సీ. మెచ్చునే రాముండు మేని సౌందర్యంబు
చెప్పవే – ఓ చెలీ – సిగ్గులేక!
ఇచ్చునే రాముండు నచ్చినదా ప్రేమ
పలుకవే – ఓ చెలీ – కలవిధంబు!
గూడునే రాముండు కులికింప నా తోడ
నిజమాడవే చెలీ – నిశ్చితముగ!
తేల్చునే రాముడు తీయని వలపుతో
బదులీయవే చెలీ విదితగతిని!

గీ. రామచంద్రుని సరసను రాణివోలె
నిలుచు సౌందర్యరాశినా తెలుపవేమె!
అందచందాల లోపంబులనునోయేమొ
ప్రేమమయుడెట్లుగూర్చు నభీష్టసిద్ధి!

అలంకరణ లోపమని అసహ్యపడునేమో! శయ్యా చక్కనిది. కాదని శంకించునేమో! చెలీ – అంతయు నీకు నచ్చినదా!

సర :—మహారాణీ – త్రిభువనైకసుందరివలె నున్నారు – మీ ముగ్ధమోహనరూపమును చూచినచో బ్రహ్మకైనను రిమ్మతెగులు పుట్టును – ఇంక యీ రాముడు మిమ్ము చూచినచో సీతమ్మమాటనే మఱచి మిమ్ములను విడనాడడు – వలపు గ్రుడ్డిదికదా!

(ప్రవేశము—ఆంజనేయుడు.)

అడుగో ఆంజనేయుడు అధికోత్సాహియై ప్రవేశించినాడు – శుభవర్తమానమునే గొనివచ్చినారుకాబోలు – పవననందనా – శ్రీరా

మచంద్రులు వచ్చుచున్నారా — మా మతంగి మహారాణిని వలపులలో కులికించెదరా !

ఆంజ :—తప్పకవచ్చెదరు - ఆయనకూడా సింగారించుకొను చున్నారు.

సర :—ఔను - వారిశృంగారమేకదా మాదేవికి వాంఛనీయము. శ్రీవారికోసమే కన్నులు కాయలుకాచుచున్నట్లు ఎదురుచూచుచు, చూడమనుచూ మామహారాణి తడబడుచున్నారు—మారుతీ—ఆమెకు ఆనందవార్తలను వినిపించినావు —

మతం :—సరమా! చాలునులేవే—నీ సల్లాపములు—

సర :—మహారాణీ! ఇందలి నా తప్పేమియు లేదుగదా ! ఉన్నదానిని ఉన్నట్లుగానే వచించితినిగాని ఉత్ప్రేక్ష చేయలేదుగదా !

ఆంజ :—మతంగీ - ఒకసలహా

మతం :—ఏమది - ఆంజనేయా !

ఆంజ :—గౌరవనీయురాలవైన నీకు తెలియని మర్యాదలే లేవు—అయినను రామచంద్రుని వ్రతదీక్షను నీకు విన్నవించుచున్నాను—

మతం :—ఆంజనేయా— సంశయమెందులకు ? శ్రీరామచంద్రునకు అన్నివిధముల ప్రీతిగలుగజేయుటయే నావిధి—

ఆంజ :—శ్రీరామచంద్రునకు శయ్యాగారములో ఎట్టి అపశకునము కలుగకూడదు. అపశకునమది శ్రీరామచంద్రుని కనులకగుపడినచో నిన్ను - నీమందిరమును - మరి త్రొక్కి—చూడడు - బహుజాగరూకతతో మెలంగవలెను—

మతం :—మారుతీ - భయపడకుము - లేదు జాగ్రత్తతోడనే కార్యక్రమము నిర్వర్తించెదను—

ఆంజ :—మతంగీ - శ్రీరామచంద్రులదుగో దయచేయుచున్నారు. సరమతో నేగి వారికి స్వాగతంబిడుము—

మతం :—ఆనందముతో

గేయము.

అందగాడే! చెలీ! సుందరాంగుడే!
విందుచేయునే చెలీ! పొందుచేర్చునే! ॥అంద॥
నీలనీరదశ్యాముని నిలిచికొల్చునే
నిశ్చితమారుని నేను వేడుకొందునే ॥అంద॥
సౌందర్యము మేనిలోనదిద్దివాడు
అందాలను మేనిలోన అద్దినవాడు ॥అంద॥
మోహనాంగుని వలపున మురిపెముంచెదా
ఇహపరముల సాధన యిపుడె జేసెదా ॥అంద॥
రామప్రేమనేనిపుడే దోచుకొంటూ
రామరాణినై కీవినిలుపుకొంటూ
రాక్షసజాతికిని ఖ్యాతిదెచ్చుకొంటూ
రాముకౌగిటన్ సుఖమునందుకొంటూ ॥అంద॥

సర :—దేవీ – సిగ్గెందుకు – రమ్ము – మంగళహారతితో మా రఘూత్తముని ఆహ్వానింపుము.

(ప్రవేశము రామచంద్రుడు)

(మంగళహారతిని మతంగి – సరము ఇచ్చినపిమ్మట)

ఆంజ :—మతంగీ – బేలవై చూచెదవేల – ప్రభువుకూర్చుండుటకు శయ్యను చూపింపుము.

రామ :—ఆంజనేయా – అదేకదా శయ్య –

(రాముడు శయ్యపైకూర్చుండును – శయ్య పెటపెట విరగును)

సర :—అయ్యో! (ఆశ్చర్యపడును)

రాము :—మతంగీ – ఇదియేనా నీప్రేమ!

మతం :—ఆహా - ఇది చిత్రముగనున్నదే - రామచంద్రా - నేను నిర్దోషిని—నన్నుమన్నింపుము.

రామ :—మైరావణునికక్ష నీలోమూర్తీభవించియున్నది - అందువల్లనే యీరీతిగా నన్ను పరాభవించితివి - మారుతీ నావ్రతదీక్షను మతంగికి తెలుపలేదా ?

ఆంజ :—తెలుపకేమిస్వామీ - అంతయు బోధించితిని !

రామ :—మరి - యీ దుష్టప్రవర్తనకేమందువు ?

ఆంజ :—అదే చిత్రముగనున్నదిప్రభూ !

రామ :—చెప్పినను వినక - చేసినపనియన్నమాట ! ఓనా మతంగీ !

మతం :—ప్రభూ ! నిజముగా నేను నిర్దోషిని !

రామ :—దోషమో నిర్దోషమో ! నాకు తెలియదు - ఇది నాకు పరాభవము - నా వ్రతదీక్షానుసారముగా - వియోగము !

మత :—రామచంద్రా - న్యాయమేనా ?

గీ. నీవల ప్రేమకు బలియయ్యె నాదు విభుడు !
మనసుదీరగ కులికించు మాటలేక
ఇట్టి శకునాల పట్టింపు పెట్టుకొనుచు
గంపెడాసల నట్టేట నింపినావె !

గీ. ఆంజనేయుడు నమ్మించినాడు నన్ను
మోసగించుట ధర్మమే ! మోహనాంగ !
చేయలేనట్టి దానికి శిక్షనిడెదె
కడకు నైరాశ్యరీతులు కాన్కలగునె !

రామ :—మతంగీ - ఇందు నా తప్పులేదు - నా వ్రతదీక్షను నేనిదివఱకే తెల్పితినిగదా - యెరిగినదో - యెరగనిదో - యేదో అపశకునము సంభవించినది - అది నీ ప్రారబ్ధము - నే నేమిచేయగలను ?

మత :—రామచంద్రా! ప్రారబ్ధమా! కర్మమా! ఇదియేనా నీ నీతి!

గీ. కర్మ పేరిట యీ శిక్ష గాంచవలెనె
వలపునంతయు సంద్రాన గలుపవలెనె
నీతి నియమాలు లేవె మీ జాతియందు
చాలు లే యింక - మా గొప్ప సరసుడవుర!

(తెరలో సంగీతము)

[పాట పాడుచు నారదుని ప్రవేశము]

గేయము.

మనసా! యేటికి యీ అడియాస!
మనుమా! అనుమానముల విడుమ! ॥మ॥
కోరరాని గొంతెమ్మ కోరికల
కోరుకొన్న ఫలమేమని యనుమా ॥మ॥
శక్తిసామర్థ్యముల సరకునేగొనక
ముక్తికై జనుట యుక్తిగాదనుకు ॥మ॥

ఆంజ :—దివిజమునీంద్రా - నారదా! నమస్కారములు.

అందరు :—దేవమునీ - వందనములు!

నార :—ఆహాఁ నేడు సుదివముగదా! ఇందరి మహానుభావులను యీ నాడు కన్నులపండువుగా గాంచగల్గితిని - వేళావిశేషము గదా! మారుతీ - (బిగ్గరగా) మారుతీ! ఏమి? శ్రీరాము డిచ్చోట నున్నాడే!

ఆంజ :—నారదమునీంద్రా - యీమె మైరావణుని భార్య!

నార :—ఔను ఎరుగుదును! పాపము - మైరావణుడు వీరమరణ మందినాడుగదా!

ఆంజ :—ఆమెసరమ - మతంగిచెలికత్తె.

నార :—ఔను ఆమెనుకూడా ఎరుగుదును - విభీషణునిభార్య గదా! రామరక్షణకై యీ మతంగికి మాయలమారి చెలికత్తెయై నది! బాగున్నది!

మతం :—ఔరా! విభీషణునిభార్యయా యీసరమ! ఎంత మోసము!

రాము :—పాపము - సరమా! నాకొఱకై నీవుకూడా శ్రమ పడినావా తల్లీ!

సర :—శ్రమకేమున్నది రామచంద్రా! మీరు సురక్షితముగా నున్న నదియే పదివేలు!

ఆంజ :—దేదీప్యమానులగు ఆ శ్రీరామచంద్రులను నీవెరుగు దువుకదా!

నార :—ఆ మహాపురుషుని యెరుగవా! రాక్షసనాశనము నకై కంకణము కట్టుకున్న ఆ వీరుడు - రాక్షసరాజగు మైరావణుని ప్రేయసీ గృహమునందున్నాడేమా? యని సందేహపడుచున్నాను.

ఆంజ :—నారదా! శ్రీరామమూర్తి వలపునుగోరి - తనప్రాణ నాథుని జీవనరహస్యమును మతంగి తెలిబుచ్చినది!

నార :—పరపురుషవ్యామోహమున మతంగి యెంతటిపాడు పనిచేసినది! (ఆశ్చర్యమున) ఔరా! స్త్రీలు సమర్థులుకదా!

ఆంజ :—మైరావణుడు మరణమందినాడుకదా!

నార :—అదంతయు మీ అందరిచలవగదా!

ఆంజ :—శ్రీరాములు మతంగికి వలపిచ్చుట కంగీకరించినారు!

నార :—సెహబాస్! బాగున్నది - మతంగి - శ్రీరాముని రాణియన్నమాట!

ఆంజ :—కాదు నారదా! అపశకునము జరుగనినాడే మతంగి వలపును అంగీకరింతునని రామచంద్రులు ఆజ్ఞ!

నార :—బాగున్నది—

ఆంజ :—శ్రీరామచంద్రులు శయ్యాగృహమును ప్రవేశించి - శయ్యపై నధిష్ఠించగా నా శయ్య విరిగిపడినని-ఆ పరాభవఫలితముగా శ్రీరామచంద్రమూర్తి మతంగి వలపును స్వీకరించకున్నారు - ఈ సంఘట్టనమును ఆమె అపార్థముచేసికొని యేవో మాయోపాయమని దురభిప్రాయపడుచున్నది - నారదా! యీ ఘట్టమున నీ రాకయేనది?

నార :—మతంగీ - మనశ్శాంతిగనుము! శ్రీరామప్రేమ యీ జన్మమున నీకు లభ్యముకాదు!

మతం :—దేవర్షి! నీవుకూడ నిరాశనే చూపించుచున్నావా?

నార :—నిరాశకాక యేమున్నది - దురాశ దుఃఖమునకు చేటుకదా!

మతం :—శ్రీరామప్రేమ మరెప్పుడు నారదా!

రామ :—త్వరలోనే కృష్ణావతారఘట్టము ప్రారంభమగును - కృష్ణావతారమున నీవే సాత్రాజితివై జనియించి శ్రీకృష్ణుని ముద్దుల భార్యవయ్యెదవు! యీరీతిగా నీ ప్రేమసార్థకమగును లెమ్మా - విచారింపకుము.

నార :—మతంగీ - ధన్యురాలవు—

ఆంజ :—అలభ్యమైన కృష్ణప్రేమను నీవు పొందినావు! దేవీ - ధన్యురాలవు—

అందరు :— గేయం.

మంగళకర - రఘువీరా - మంగళంబురా!
మంగళముల గొనవేరా! మహిజాసుధీరా!
నీలశరీరా! నిఖిలాధారా! నిశ్చితవీరా!
యేలర దయమీరక్షమమ్ము హితవులుమీర!

జై హింద్

**Published by Kalahasti Thamma Rao & Sons, E. G. 60.**
**Printed at Rajeswari Press, Rjy. Cop. 1000, 1945-1947.**